శ్రీరామజయము.

# శ్రీ రామ స్తవ రా జ ము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీకల్యాణసదాశివేశ్వరకపర్ది బ్రహ్మాఃష్ణుస్వ।
రూపాకారాకృతిమీరునట్టిపరమాత్మైక్యానుసంధానభో।
గాకారోన్నతయోగివర్యగురువాక్యావాప్తబోధోజ్జ్వల।
శ్రీకాంతాప్రియుఁడైననిన్ను మదిలోసేవింతునశ్రాంతమున్॥

శా॥ శ్రీరామారఘునందనారఘుపతీసీతామనోనాయకా। కారుణ్యా
భయదానహస్తవరదాకాకుత్స్థవంశోద్భవా। దారిద్ర్యాంధతమిస్రతాపహర
ణాతత్త్వాబ్ధిచంద్రోదయా । రారానామదిలోవసించికృపతోరక్షించరామ్రొ
క్కెదన్॥ ఉ॥ పెద్దలసేవఁజేసినను బెంపకుఁగాకవృథాభిమానులై। గర్వియసు
ద్దులందగిలికానక మూఢులుకొందరుర్విలో। ప్రొద్దులుపుత్తురట్లచెడిపోవకసా
మినిభక్తిఁగొల్చినన్ । దద్దయుఁ మోక్షమబ్బుగదదాశరథీజనకాత్మజాధిపా॥
చ॥ కరములుమోడ్చిదన్ హరికిఁగాళికిమ్రొక్కెదఁగూర్మితోడుతన్। గురునకు
వందనంబెపుడుగోరికఁజేసెదకావ్యలన్నెరం । తరముఁదలంచెదన్నలువదామ
రసాక్షినుతించెదన్మదిన్। సరసకవిత్వబోధలువెసంగలిగించుటకున్ముదంబునన్॥
గీ॥ మూఁడుమూర్తులమతిమఁగ్గురిల్లాంధ్రను। బ్రస్తుతింతుఁబరమభాగవతుల।
నుతులచేసి పెక్కుగతులవాల్మీకాది। కవులఁదలచి తెనుగుకవులఁదలఁతు॥ వ॥ అని
యిష్టదేవతాప్రార్థనంబును బరమభాగవత కీర్తనంబును వాల్మీకాది సత్క
విస్తోత్రంబునుం జేసి సర్వజనంబులకుం బ్రియంబుపుట్ట మద్గురుండైన ధేనుకొం
డ తిమ్మయాచార్యుంబూజించి శ్రీరామ స్తవరాజంబను మంత్రరాజంబుఁ దె
నుఁగుసేయంబూని యేను బాల్యంబున సకలవేదాంత సిద్ధాంత సారసంగ్ర
హంబైన తత్త్వార్థంబుల తత్త్వచంద్రోదయంబను ద్విపదకావ్యంబురచియిం
చియాతత్త్వచంద్రోదయంబునకు జానకీనాథు నాథుంగా నియోగించి సంతసి
ల్లితినిప్పుడీమంత్రరాజంబైన శ్రీరామ స్తవరాజంబను నీప్రబంధనాయకరత్నం
బునకు సర్వలోకనాథుండైన శ్రీరుక్మిణీనాథు నాథుంగానియోగించి సద్గురు
ధ్యానంబును బరబ్రహ్మరూపానుసంధానంబుజేసి కృతకృత్యుండనగుమద్వం

శ్రమంబెట్టిదనిన॥ సీ॥ శ్రీకరంబైనట్టికృష్ణానదికిదక్షిణాదియౌ నాంధ్రరాజ్యం
బునందు। నొప్పెనకొప్పరా పురరాజధానికిభోజుఁడౌముమ్మడిరాజమంత్రి।
సుభగుఁడాపస్తంభసూత్రియజుర్వేది శాండిల్యగోత్రుఁడాచతురునకును। దన
యుండుపెద్దనాతనిసతిజువ్వాంబ వారికిగంగన్నవరసుతుండు। వానికిల్లాలుస
ర్వాంబవారలకును। ఘనుఁడుకృష్ణయప్రభుఁడనఁగలిగియతఁడు। పేర్మిఁదుళ్ళూ
రివారాడబిడ్డయైన। రఘుపతమ్మనుబెండ్లియైరమణమించె॥ క॥ ఏమగువలుసరి
సాటియె। భూమిపతివ్రతలలోనబుధసభలందుఁ। వేమారుఁగీర్తిఁగెక్కెన।
యామమ్మడిరాజకృష్ణయరఘుపతమ్మకుఁ॥ క॥ ఆమిథునమునకుముప్పవర। మే
ముదయించితిమియందు మేటగువాఁడఁ। రామునిభక్తుఁడమల్లన। నామాఖ్యా
తుండసజ్జనప్రియరతుఁడఁ॥ క॥ గురుబోధామృతతుల్యుఁడ। గురుతరతత్త్వో
పదేశకోవిదగురుఁడఁ। గురుసేవావ్రతచర్యుఁడ। గురుతర వేదాంతరంగగురు
కవివరుఁడఁ॥ క॥ కొలిచినదిరామచంద్రునిఁ। దలచినదిపరస్వరూపధ్యానము
సేయ। న్వలచినదిముక్తిలలను। నిలిచినదిపురాకృతంబునిజమనితెలుపన్॥ క॥ పలి
కినదివేదతుల్యము। చిలకననదికృపారసంబుశ్రితజనులందుఁ। గులికినదియోగ
చర్యలు। నలికినయాదియౌయవిద్యయహితులుబెదరన్॥ శా॥ శ్రీశైలేశువరప్ర
సాదమునతత్సిద్ధాంతనామంబులన్। ఆసీతేశునివాక్యమా నభయమున్నధ్యా
త్మతత్త్వంబును। ద్దేశంబొప్పఁగ నారదుండు దయసందేహంబులన్బాపుటే।
యీశాయాగదనీవనేనిజము యోగీశాబ్ధిచంద్రోదయా॥ అట్లుగావున॥

క॥ ఆరోగ్యభాగ్యమొసఁగఁగ। నారాయణునింబ్రబంధనాయకమణిఁగా।
శ్రీరామస్తవరాజము। ధారుణివెలయంగఁజెప్పెదనునేఁబ్రీతిన్॥ వ॥ అదిసూత
ప్రణీతంబును వ్యాసధర్మజసంవాదంబును నారదప్రోక్తంబునగుటంజేసి యది
యునొక యీశ్వరారాధనవిశేషంబగుటనేఁజేసెద॥ ... ... *

## (షష్ఠ్యంతములు.)

క॥ సర్వశరీరవిహారికి। సర్వాలంకారభోగసౌభాగ్యునకు। స్సర్వగు
ణాతీతునకును। నిర్వాణికిహరికిరుక్మిణీనాధునకున్॥ క॥ వ్రజాజవజవికల్పిత।
దుర్జనసంసారదోషదూషితవాంఛా। నిర్జితయోగీంద్రవివే। కాజితవస్తు
వునకుఁబరునకానందునకున్॥ క॥ నిత్యనిరంజననిరుపమ। సత్యాత్మామోదవి
భవసామ్రాజ్యునకున్। అత్యంతభక్తహృచ్చరు। ప్రత్యక్షునకునుమహానుభావా
ఢ్యునకున్॥ క॥ గోపాలవేషధారికి। గోపీజనపూర్వభాగ్యకూపాశ్రయు
కున్। గోపస్త్రీవేష్టితునకు। గోపక్రీడావినోదగోపాలునకున్॥

క॥ భుక్తిరజితప్రపంచము యుక్తిక్। మిథ్యాభిమానయోజనపరుఁడౌ। భక్తపరాధీనునకును। భక్తునకును సర్వశక్తిమూర్ధన్యునకున్॥ క॥ బిందుకళాతీతునకును। యిందుకళాధరనుతునకు పేంద్రాఖ్యునకు। స్వందితసుత్రామునకును। యిందీవరనేత్రునకు మునీశ్వరపతికిన్॥ క॥ నీకుం బ్రబంధరత్నముఁ। నైకానుకసేసి నీదుకారుణ్యమునన్। లోకంబులందు వెలసెదఁ। జేకొనుఁ రాకేందువదన శ్రీకృష్ణహరీ॥ వ॥ నిత్యమంగళపరంపరాభివృద్ధిగా నావిన్నపంబు సేయం బూనిన శ్రీరామస్తవరాజంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభంబెట్టిదనిన నైమిశారణ్యవాసులాదియైన శౌనకమహామునీశ్వరులొకానొకనాఁడు రేపకడలేచి సంధ్యాద్యనుష్ఠానకృత్యంబులు దీర్చి సూతునిచేత సర్వపురాణేతిహాసంబులు వినుచు శ్రీరామస్తవరాజశ్రవణోత్సుకులై॥ క॥ శ్రీరామస్తవరాజము। పారాయణమెవ్వఁడు సేయుఁ బ్రతిదినము సుశ్రీ। కారణగురుచేవాఁడే। నారాయణపదమునొందు నమ్మఁడు ధాత్రిన్॥ క॥ శ్రీరామస్తవరాజక। థారంభం బిట్లు శౌనకాదులు సూతుం। జేరి నుతించి మహాత్మా। తారకనామంబు మాకుదసేయఁగదే॥ వ॥ అనిన మునులకు వ్యాసశిష్యుండగు సూతుండిట్లనియె॥

(కథాప్రారంభము.)

సీ॥ సర్వవేదార్థవిజ్ఞానసత్యవతీసుతుండు నౌ వ్యాసునిఁ బాండవాగ్ర। జుండు పూజలు చేసి సుముఖుఁడౌ భగవంతుఁడవు మహాయోగీశుఁడవును శాస్త్ర। గురుఁడవు తత్వంబుఁ బరజనంబును ముక్తిసాధనధాన్యంబు జాడలెవ్వి। యెట్టివిమోక్షగింపుడీరనరాజుతో వినుమహాభాగ యేగనిన తెల్వి। యెద్దిపరమగుణాతీతమెన్న నెద్ది। జ్యోతిరయమలంబు శివమదే ఖ్యాతిగాఁగ। బరమనిత్యంబుఁ గైవల్యపదము త్రోవ। యిదియె శ్రీరామయనుజపంబింతను హిమ॥ క॥ శ్రీరామజపోత్కర్షణముఁ। దారకమను బ్రహ్మసంజ్ఞ దానిపఠించే। వారేదోషము నొందరు। యీరీతి నివేదవేత్తనెఱుఁగుదురెఱుకన్॥ గీ॥ ప్రాజ్ఞులెవ్వారు శ్రీరామరామరామ। యనుచు సతతంబుఁ బఠియింతురట్టివారు। భుక్తిముక్తుల రెంటిని బొందువార। లిందుకై సంశయింపఁగనేల ననఘ॥ మ॥ మహిమన్నిస్తవరాజమున్పలికె నాత్మజ్ఞానియౌ నారదుం। డుహరిధ్యానపురస్సరంబుఁ గనుట న్నోరూరనేఁజెప్పెదన్। బహుసంపత్కరముందరిద్రహరముం బ్రహ్మైక్యసాధ్యంబునున్ సహజంబౌ విను నన్యదుష్కృతములన్ సంహారంబు నన్పొప్పుచున్॥ సీ॥ శ్రీరామకృష్ణులసేవించితధ్యానభావంబు లెఱిఁగింతు సావధానముగ వినుసాకేతనగరంబులోపల రత్నమంటపమతిరమ్యముగను। దానిమధ్యంబున దలపోయసురభూజ

జమమ్మూలరత్నసింహాసనంబు। దన్మధ్యమునసష్టదళపద్మముండును మాణిక్య
ములచేతమలసిదాని। నట్టనడుమను రాముఁడున్నట్లుదలపు।కోటిసూర్యప్రకా
శమైకోమరుమిగుల। నింద్రనీలసమప్రభలీనువానిఁ। దంద్రితోడమీదగూర్చుండు
చారివాని॥ సీ ॥ అత్యంతకోమలంబైనయంగమువాని విమలవిశాలనేత్రముల
వాని। భానుకోటిప్రభాభాసితుండగువాని రంజిల్లుపీతాంబరంబువాని। మా
ణిక్యకుండలమంజీరములవాని గంకణకటిసూత్రగణనవాని। హారకిరీటకేయూ
రముల్గలవానిఁ గరమొప్పుద్విభుజముల్గలుగువాని। చిన్నవానినిలేనవ్వులున్నవా
నిఁ। జదువుచుండెడియోగశాస్త్రములవాని । రాముఁడనుపేరుగలిగినరాచ
వాని। నట్లుదలఁపుముయోగీశుఁడైనవాని॥ గీ॥ కిన్నరామరగంధర్వకింపురుషు
లు । నారదాదిమునీంద్రులుజేరికొలువ । భరతలక్ష్మణశత్రుఘ్నపరివృతుండు।
నామహాత్మునిసతతంబునాత్మదలపు॥ గీ॥ వరవసిష్ఠగాధేయాదిపరమబుధులు।
జ్ఞానులైనట్టిసనకాదిమానివరులు। సేవలొనరింపరఘుకులశ్రేష్ఠుఁడైన । రామ
చంద్రునిఁదలఁపుమురాజవర్య॥ క॥ చక్కదనంబానందము। నిక్కవమైవిల్లుబ
ట్టినెరజాణతఁబెం। పెక్కపరంజ్యోతినిశుభ । పెక్కవయాగౌసలేయునిటు
లదలపుమా॥ క॥ ఆనారదమునివర్యుఁడుఁ। నానాలోకోపకారనటనలకొఱకై।
మానసమేపొంగగవిను। ధ్యానించెనురామచంద్రునద్భుతపరుఁడై॥ గీ ॥ పర
మునేకంబునిత్యంబునెఱుకసుఖము। నైనదెట్టిదియాలోకమందునట్టి। నిండిపం
డినరూపంబునేఁదలంతు। ననుచుజింతింపుచుండెవావ్యాసమౌని॥ క ॥ విజ్ఞాన
హేతుభూమిని। ప్రజ్ఞానునివిమలనేత్రుభద్రచరిత్రున్। సుజ్ఞానదివ్యరూపుని।త
జ్ఞునిశ్రీరామచంద్రుదలపుఁదునాత్మన్॥ క॥ కుదురుగుఱిలేసవానిని। చదువులగు
సగుసలవానిసడిసన్నయునై। కుదువలకొదవనివానిని। మొదలోగనెరాచవా
నినేలినవానిన్ ॥ వ ॥ అనుచుఁజింతింపుచువ్యాసుండునారదవాక్యంబుగానిట్ల
నియె॥ సీ॥ నారాయణుఁజగన్నాథుఁగవీశ్వరు రాజేంద్రువిశ్వేశురామభద్రు।
జానకీవల్లభుసౌమిత్రిపూర్వజుశంకరునాదిత్యుజామదగ్న్య। శాంతునిసత్య
సౌజన్యునిగురుమూర్తిగరుడవాహనువిష్ణుగమలనాభు। దాపసకాముదుదశర
థవరపుత్రుఁగారుణ్యునానందుఁగౌసలేయుఁ।జిన్మయానందవిగ్రహుశేషమూ
ర్తి। మత్స్యకూర్మవరాహాదిమత్స్యరూపు। వాసుదేవునిసవ్యయువరదుహరి
ని। నాత్మలోపలఁజింతింతునను దినంబు॥ సీ॥ కన్నవాఁడారారకనుగొన్నవాఁడ
రాచిన్నారిపొన్నారిచిట్టిరార। నాకూర్మిపట్టిరావాకుమారకరారయన్నరా
రాముద్దుచిన్నరార। అయ్యరారానల్లనయ్యరారాయిలుపుడు నాపుణ్యపరిపా

కనటనరార| నాచక్కనయ్యా రానాతోడునీడ రాయప్పచ్చికొండ రామయ్యారా
ర। అప్పయిందులవత్తురే యనుచుబిలుచు। తల్లికుల్లాసముగనల్లిబిల్లి గొనుచుఁ।
కాళ్లనందెలుఘులుఘుల్లుఘుల్లుమనఁగ। మురుపుజూపెడు కౌసల్యముద్దుదలఁతు॥
క॥ తడవులనిన్నుఁగంటిని। వెండబాయగజాల రార యేమిటికొరకైపొడకట్ట
వింతదడవని| నొడివెడుఁగౌసల్యానోచునోముదలంతుఁ॥మ॥అనుచుఁ రాముని
జానకీసహితుఁగానానందపట్టాభిషే। చనుఁగా నిత్యుసిఁ గామహామహునిఁ
గాసత్యవ్రతసద్వాంతుగా। ఘనవేదాంతవివేకిఁ గావిజయుఁగాగౌసల్యగారా
బుప| ట్టినిద్దానౌమ్యకటాక్షవీక్షణునిగాడెందంబునన్నిల్పుచుఁ॥ గీ ॥భరతల
క్ష్మణశత్రుఘ్నపవనపుత్ర। భానుజవిభీషణాశ్రితభటులుగొలువ। సర్వయోగీం
ద్రపాదసంశ్రయుఁడునగుచు। జానకీయుక్తుడగు రామచంద్రుదలఁచి॥ మఱియు
ను॥ సీ॥ అనిరుద్ధగతిగూర్చి యనిరుద్ధమతిజేర్చియనిరుద్ధయోగులై యలరువారు।
బిందుకళాంత నాదేందుకళాంతసంవి ద్రూపమునవిల్గుపొగు వారు। నిర్బంధని
ర్భేదనిర్భిన్నభిన్నతత్వోపదేశికుజూపనోపువారు। నలఘుపదస్ఫూర్తినలఘు
లఘుత్వులైయలరువారు।సుభయకన్యాసమేతులైయుందువారు। నవధిగలుగం
గలేకుందునవధివారు।గ్రాహ్యపట్టాభిరాములై రాముకొలువ।వెలుఁగు వెలుగం
గవెలుగులో వెలుగువారు సీ॥ స్థానత్రయంబులసంగత్రయంబులబంధత్రయంబు
లబారదోలి।జీవత్రయంబులచిత్త్రయంబులబింబత్రయంబులడిందుపరచి।దైవ
త్రయంబులతాపత్రయంబులయీషణత్రయములదోషముడిపి।కర్మత్రయంబుల
కారణత్రయములవాసనాత్రయములవడినిద్రోచి।యొందుపరమాత్మగనువార
లుర్విలోన।బాహ్యసంసారమెల్లనుబయలుజేసి। ముక్తికాంతనుమదిలోనముద్దు
గొనుదు। రనుచుశిష్యులబోధించినట్టివారు॥ క ॥మాయయనుజోడుదొడుగకఁ
గాయంబనురథమునెక్కికర్మపువింట। న్నేయఁగనాశాబాణో।పాయంబునఁ
జిత్తరాజుపడుమదినేతఁ॥ క ॥హింసించెజీవరాసుల। సంసారోత్తీర్ణశాస్త్ర
సద్ధర్మగుడై। హంసాహోహమ్ముడైమీ। మాంసోత్తరకాండవ శతమానవరా
జుఁ॥వ ॥అనుచుమనోవృత్తులందెలుపువారును, మోక్షంబుసద్గురుకటాక్షవీక్ష
ణాలేశంబునసులభంబగు గానిదుష్కరాభ్యాస యోగంబులలేదనువారును
మనోవృత్తివాయునిరోధంబైనయోగాభ్యాస బలంబులేక జయించ రాదను
వారునుజీవ పరైక్యస్వభావంబునపవన సంకల్పంబుప్రయాసంబుగానిల్పగా
నప్రయాసంబుగొగాస్పదంబనువారును, రోగంబులకుందప్పిన వాయునిరోధ
యోగఫలంబదీర్ఘాయుర్మహాత్వంబనువారును, యమనియమమహాత్వమహి

హంబులు సిద్ధక్రియామాలికామణిమంత్రతపస్సిద్ధులంగలడనువారును, శివాగ
మప్రోక్తంబైనమంత్రలయహఠరాజయోగంబులలో మంత్రరాజయోగంబుశి
వపంచాక్షరీయుక్తంబై కల్పితాకల్పితమాలికాజపంబునలయంబైన యజపా
యోగంబునంబ్రవేశించిబంధత్రయరేచకపూరకకుంభకంబులంగుంభించి క
ర్మాష్టాంగహఠయోగ ప్రయాసంబునన ష్టైశ్వర్యయుక్తుండగుచునీశ్వరాను
గ్రహశక్తినిపాతసమయంబునసదాచార్యానుగ్రహంబునసాంఖ్యతారకంబు
లయిన కేవలకుంభకంబైన విరాజయోగంబున జాగ్రత్స్వప్నసుషుప్తులనతిక్ర
మించినిష్ప్రపంచంబైనవెన్నెలబయలుననుసరించిదుర్భరానందసముద్రంబున
మునింగి తెలివుమఱపు తలంపుస్వరూపాను సంధాన ధ్యాన జపంబులులేక
యమనస్కంబైనతుర్యంబున నెఱుకసెడకతాఁదానగనుచుఁజతుర్విధయోగరహ
స్యంబులం దెలుపువారును వేదాంతశాస్త్రంబులనిరామయనిరాభాసనిర్వికల్ప
నిష్ప్రపంచంబైనసనాతనబ్రహ్మచిదంశంబునరజ్జుశుక్తిస్థాణువులు లేనియహిర
జితచోరాద్యారోపణలెట్లట్లతోఁచిన మాయాప్రపంచంబుదబ్బరగు టం జేసి
సంవిన్మాత్రుడై జీవుండుతన్నుదాఁ దెలిసినముక్తుండగుమాయానసవి భ్రమంబు
నతన్నెఱుంగమింజేసి బద్ధుండగుఁబంధ ముక్తులునాత్మకులేవు సంకల్పస్వభా
వంబనువారును, యాత్మసాక్షాత్కారపరుండైనకారణగురుండుశక్తినిపాత
సమయంబునదోఁచునను వారునుకర్మముక్తులుమహాసంకల్ప భోగంబులఁగల
డనువారును, సద్భక్తినిఁగానియీశ్వరానుగ్రహజ్ఞానంబులు లేవను వారును,
మఱియుదక్కనవారునుంబరివేష్టించికొలువసింహాసనంబున సీతాసమేతుండై
యొప్పు శ్రీరామచంద్రుండదలంతునని మఱియు నారదుండిట్లనియె ॥గీ॥ గోకులా
వాసుగోవిందుగోపినాథు। వేణునాదానుభవమున వెలయువాని। స్త్రీలతో
గూడిక్రీడలఁజెలఁగువాని। రామకృష్ణాఖ్యునామదిబ్రేమదలఁతు॥క॥ చక్కనిబా
లుఁడనుచును। చెక్కిలిముద్దాడుస్త్రీలచేసన్నలచే। స్మొక్కులగిలిగింతలచే।జో
క్కొంపుమగేలిసేయుసుభగుదలంతుఁ ॥క॥ శుద్ధబుద్ధసిద్ధిసూక్ష్మస్వరూపుని।సర్వ
భూతకర్తసర్వమయుని। సర్వకారణాత్మునిసత్యసంకల్పుని।ప్రణవవరుని రామ
భద్రుదలఁతు॥గీ॥ రూపురేఖలేనిరూకక్కమైయొక్కచై। వేళపాళలేక వెలుగుచు
న్న। రామచంద్రుఁబ్రకృతిరహితు మహాత్ముని। మదినిదినము నేనమస్కరింతు॥
గీ॥ చింతసోకబోక జేటుకుసోకకనీక।లెక్కలేకయొకటిచక్కగాక। కలిమిగాన
రాక తెలివిమొవడిదీక।ఈనవాక నేర్పువానిదలతు॥గీ॥ అనుచునారదుఁడునాడి
త్యావలంబగా। భానుబింబమధ్యవరునిగాను। సర్వసాక్షిగాను జానకీవల్లభుస

స్నుతించి మదిసంతసిల్లె॥మ॥అను నావ్యాసునితోడధర్మజుడుబ్బోధానందమగ్నా
త్ముండై। తనివోదింక మునీంద్రచంద్రపరమార్థజ్ఞానసంచారముల్।ఘనకర్మం
బులత్రోవభక్తిగతిసాకల్యంబులొనట్లుగా।వినుపింపుండనమానిపల్కెమనసు
ప్పొల్లారనోరూరఁగ॥సీ॥ భూనాథనీప్రశ్నసపురుషార్థహేతువులోకోపకా
రంబునౌగనంగ। పురుషార్థవిగతులైపోయిసంసారాభివృద్ధియేపురుషార్థసిద్ధి
యనుచు। బెండ్లాముబిడ్డలుపెనిమిటియనుకొంచుకంటుకాపురమిదియంటచెలఁ
హోయియెన్నడులేకనన్నింటికికారికడగండ్లగున్నలైయి దుమ్ముడుచు నొక్క
నాడైననొకయింతయుబ్బులేక।పడుచులేచుకునుండుటకెడములేదు।మెప్పడై
ననుతమగతికొప్పరయ్య।యేమిచెప్పదునీవెఱ్ఱికామకులను॥క॥ ఇటువంటిమా
నసభ్రమ। నెటువలెగడుపంగవచ్చునీశుడుసహాగా।వటుమాయనటనలుచూ।
చుటనిజమాగాదెమఱియుబోద్యముగలదే॥ ఉ॥నేననునాదియొనెఱుగనేనను
నోటిదినోటనుండగాఁ।నేననహంకృత్తేయెఱుగనైతికనిక్కుచునోటుజెందుచు।
న్నేనననెవ్వడోయగుచు నేనును నేనునిజంబులైభ్రమ। జ్ఞానవశానజీవుడగుసం
స్ఫృతిబొందునరాధినాయకా॥గీ॥నేనుగలిగిననీవునుగానబడదు। నేనునీవునుగ
లిగిననిగుడుజగము।నీవునేనునువొకటైనభావమెప్పుడు। గానబడునట్టికాలంబు
దీనికవధి॥గీ॥వీడువాడనినాత్మకెవ్వాడుగలడు। వాడువీడనమానసవైభవంబు।
వాడువీడునునొక్కటౌనాడజూడ। నెవ్వరెక్కడగానయెఱుకదక్క॥ గీ॥
దృష్టిగనుపట్టునవియెల్లదృశ్యమండ్రు। దృశ్యములగాల్చు తెలివి దెలివియండ్రు
వెలిప్రపంచంబునీవును విడిచిపెట్టి। నిర్వికల్పసమాధిలోనిగుడవయ్య॥ చ॥ చది
వెడిశాస్త్రవాసనలు సన్నుతిగోరెడి లోకవాసనల్। కదలుచుదీర్ఘయాత్రలను
కాలముపుచ్చెడిదేహవాసన। ల్మదమనివాసనాత్రయముమానినిజంబగుశుద్ధ
వాసనా। స్పదగురుబోధలందుటకుపారముముట్టుటయెంచిచూడఁగ॥గీ॥ శా
స్త్రలోకదేహసామాన్యవాసన త్రోవసూడముక్తిత్రోవగూడు। గాకమానె
నేనికర్మంబుపాలగు। నరవరేణ్యకపరమర్మదేల॥గీ॥ తనకుదానెకానితనకెద్ది
యునులేని। తలపుకలుగువాడుతత్వవేత్త। తగిలెనేనిపోదుతలపునదత్వంబు। త
గదుగురునిమీదితలపువీడ॥ గీ॥ తనువునీవుగావుతలఁపులునీవుగా। వింద్రియము
లుగావుయెఱుకగావు। తెలుపుమఱుపులేని తెలివియేనీవయా। చింతదీరిముక్తి
కాంతగూడు॥ గీ॥ నీవుగలుగుచోటనిబిడీకృతానంద। సంభృతంబు।పరమసం
భ్రమంబు। నీవులేనిచోటునిబిడాంధకారాది। బంధకంబుకమఱబంధకంబు॥క॥
లీలామానుషవిగ్రహు। నీలోనేనిన్నునీవునీవెకనగా। నీలోనాశ్చర్యంబులు। నీ

లోననె పుట్టునణగునీశ్వరుయుండుఁగ॥ క ॥ రాఘవయ్యాధర్మతనయా। జీవుడనను
భ్రాంతివిడిచిచిత్తములోన। నేనేనీవనికనునీ। భావననీవాట దెలియబడును మ
హాత్మా॥ క॥ జ్ఞానముసులభముకఠినము। లౌనీరెండుగనుత్రోవలవియెట్లనినన్।
తానని మొఱిగెడియెఱుకే। తాననిసులభంబు నేను తానకఠినమా॥ గీ॥ సర్వక
ర్మోఘపరతిగాకసంశయంబు। దీఱదామీద టనుగానిదివ్యమైన। సుఖముదోచ
దునాతోచుసుఖముదనకు। వేరుగాకుండ దెలిసెనాధీరుడగును॥ గీ॥ అనఘబ్రం
హ్మోపదేశదృష్టాంతమెల్ల। దెలియజెప్పితినీవును దెలివినొంది। సకల సామ్రా
జ్యసౌఖ్యముల్సమతనొందు। మెరుగవంతునకెట్లున్న నేమి కొదువ ॥గీ॥ వెలిప్ర
పంచంబుమిథ్యని తెలిసితన్ను। నెరుగ నేర్చినయోగీంద్రుడింటనున్న। యడవి నుం
డినయారెంటినడకసమమె। కాకమఱియాత్మకీసటలాకారణంబె॥ క॥ ప్రారబ్ధ
మనుభవించక। తీరదుయాగామియంట దెప్పుడువరుసన్। దీరుమరిసంచి తం
బులు। దీరునునునుగన్న వేళధీరాత్మునకున్॥ మఱియుఁగర్మంబెట్టిదనిన॥ సీ॥ క
ర్మముల్ చేసినకడ తేరగూడదు సేయకుండినగతుల్లాయాకుండు। చేసినకర్మం
బుశివునకర్పింపుచుఫలసంగరహితులై పరగవలయు। చేసియుకర్మంబు సేయ
కుండిన నేర్పుత్రిగుణభావంబని తెలియవలయు। కర్మంబులెవ్వనిఘననిత్యనైమి
త్తికాచారనియమంబులంద్రుబుధులు। ఫలములీడైన త్రిగుణస్వభావమనుచు।
నైనయధికారములకొద్ది నాచరింప। వలయుగురువాక్యపద్ధతివరుసగాను।యా
త్మసాక్షాత్కరించుపర్యంతమధిప॥ గీ॥ సకలమాయాప్రపంచంబు సగుణ మ
య్యె। సగుణనిర్గుణరూపంబుసాక్షియయ్యె। సాక్షిరూపంబునిర్గుణరూపు
సచ్చిదానందమును రామచంద్రుడయ్యె॥ గీ॥ అట్టిరామచంద్రుననిశంబుకీర్తన
ధ్యానములను నాత్మదలచితలచి। శాంతహృదయుడగుచుసత్సంగమునజేరి।భ
క్తిసేయునతడుభాగవతుడు॥ గీ॥ కర్మభక్తులచేతను క్రమముతోడ। జిత్తవి
శ్రాంతినొందునుశీఘ్రమందె। కావునను గర్మభక్తులుజీవునికిని। సేయవలసిన
కార్యంబుసిద్ధమయ్యె॥ సీ॥ తామ్రమృణ్మయశిలా దారురూపంబుల భావించు
బూజించుచాముకుండు। పిన్నపెద్దలటంచు వేల్పులవరుసనన్మానించుహర్షిం
చుమధ్యముండు। తారతమ్యములేక దైవముందటియందునున్నవాడనిచూచునుత్త
ముండు। నీయుత్తమశ్లోకుడీశ్వరుదర్శించుకన్నవానిసతండు గాంచుచుండు। న
ట్లుగావుననీలోచునఖిలజగము। నందునీశ్వరు నీశ్వరునందుజగము। వేఱులేక
యొకవెలుగొందువిధముసీవు। తెలిసికృతకృత్యుడవు గమ్మునధీరహృదయ॥ గీ ॥
తామ్రమృద్దారుశిలలసుదలప్రతోన। యీశ్వరుండని పూజింపనేమిఫలము।తన

మదినయాంపనీశుండుతమ్మునాను। దెలియనేరనివానికిదెరువులవియ॥ సీ॥ ఆర్తు
డైహరినామకీర్తనల్బెట్టుగా నోరూరనెవ్వఁడునొడువుచుండు। నత్యంతవాం
ఛతోనఖిలేశుచారిత్ర మింపారనెవ్వఁడాలించుచుండు। సర్వసంగత్యాగసము
తనిర్వైరుఁడై సంపూర్ణునెవఁడుభోగించుచుండు। దేశికశ్రీపాదతీర్థ ప్రసాద
ముల్ స్వీకరించెవ్వఁడుచెలఁగుచుండు। వాఁడెధన్యుండుమాన్యుండువణికతుఁడు।
వాఁడెభక్తుఁడుముక్తుండువైభవుండు। వానివెనువెంటనీశుఁడే వేళనైన। దోఁచు
నీడైయుండరనాడునయ్య॥ శా॥ సత్సంగంబునునాత్మచింతగురువిశ్వాసంబువై
రాగ్యము। న్వాత్సల్యంబునుజిత్తశాంతియును సర్వభ్రాంతి శూన్యత్వము।
న్మాత్సర్యంబులులేకయుండుటివిసన్మార్గంబులౌయోగిక। త్యుత్సాహంబున
దన్నుఁజెందిహృదయంబుప్పొంగఁగాఁ బాండవా॥ వ॥ అనియనేకవిధంబులఁగ
ర్మభక్తివైరాగ్యంబులకుఁ జిత్తవిశ్రాంతికారణంబని జీవునినిశ్చయంబును స్వ
రూపసందర్శనసుఖహేతుత్వంబునుం దెలుపంగలవాఁడనను మఱియువ్యా
సుండు ధర్మజునకిట్లనియె ననాదినిర్వికల్పుండైన యాత్మునియందు మిథ్యారూ
ప్రపంచంబునుం దోఁచినతెఱంగెట్లనిన మాయాబ్రహ్మసాన్నిధ్యంబునశుద్ధస్ఫ
టికంబుమీద దాసానికుసుమంబుఁ జేర్ప నదుమఛాయదోఁచినట్లుజీవుండు గనుప
ట్టు నాజీవుండుముఖంబుననుండి విశ్వుండనుపేరిట విషయంబుల ననుభవించు
జాగ్రత్వంబునదై జననామధేయంబున స్వప్నంబునఁగంఠప్రదేశంబునదజ్జాగ్ర
ద్వాసనాయుక్తుండై వక్షప్రదేశంబునంబ్రవేశించి సుషుప్త్యవస్థంజెంది ప్రా
జ్ఞుండనంగసహంకారంబను తమంబునందులీనంబైయుండేమి నెఱుఁగఁడుసం
విత్తుసాక్షిరూపంబుననుండుటం జేసి తత్సాన్నిధ్యంబుననుండివచ్చెంగావుననిం
దాకనేమిసేసితినోయని యూరకుండెడివిధంబు దెల్పుఁ దద్విధంబు చిత్తుసహా
యంబునం దెల్పు నాసంవిత్తుసాన్నిధ్యంబులేకున్న నూరకుండునను తెలివిలేకుం
డవలయు నాయహంకారంబెప్పుడు జాగ్రదభిముఖమగునప్పుడు సంవిత్తుసా
న్నిధ్యసహాయతాత్పర్యంబున సుఖంబుననుంటినను నెఱుకసంప్రాప్తంబగు నా
సుషుప్తినుండి తుర్యనామంబునఁదుర్యావస్థనొంది బ్రహ్మానందంబనుభవించుచు
నాభినుండి తుర్యాతీతంబుననతీతనామంబుధరియించి మూలాధారంబునపర
క్షణంబు పరమానందసుఖస్వరూపంబుననుండి యథాప్రకారంబుగా తిరుగు
సతతంబీయవస్థాపంచకంబుల పంచదేహంబులు ధరియించి యాపంచకంబు
లంగూడునిదియోగిరెఱుఁగు నితరులెఱుంగరాజీవుండాత్మవాసనాసమయం
బున నవస్థాత్రయంబులందాటి వాసనాత్రయంబులంద్రోసి వాసనయుత్రోవ

వాత్మైక్యానుభవంబగుఁ దదాత్మానుభవసారంబునఁ బంచదేహావస్థాభిమా
నభంగంబై హృదయగ్రంధినాశంబునశుద్ధజ్ఞానంబునఁ బ్రపంచంబు లేదనుటలు
పపన్నంబుగావున సుషుప్త్యవస్థయందుఁ జిత్తుసాక్షియనిచెప్పుట లుపచారం
బుశుద్ధసంవిత్తునందుఁ బ్రపంచభ్రాంతిరజ్జునందు సర్పభ్రాంతివిదోఁచి పిదపలేని
తెఱంగున భ్రాంతివిడినప్రపంచంబులేదైనందోచెనంటివేని ధవళశంఖంబుఁజూ
చిపచ్చనని భ్రమసిన నందుపచ్చనలేదు తియ్యనిపాలకుఁజేదన్న దోషభ్రాంతి
యౌఁగాని తియ్యనిపాలకుఁజేదులేదని నిశ్చయంబుసుజ్ఞానమార్గంబునసున్న
దున్నట్టుగాఁదెలియ జగద్భ్రాంతిశ్రీగురుకటాక్షంబునందీఱు నీవును సద్గురుక
టాక్షంబునవస్థాత్రయవ్యతీతంబైనతుర్యంబున బరమానందంబునంజెందుమా
సుఖంబు బుద్ధిచేతనెఱుంగంబడు బుద్ధికిఁదెలివిలేదన్న నానిజంబుబుద్ధిజడంబుగా
వున బుద్ధిచేతఁగనుటలుపపన్నంబుగాదైనను గన్నులుండినంగాని సూర్యునిద
ర్శింపంగూడదు నేత్రోపాధినిసూర్యాంశంబైననేత్రదృష్టి సూర్యునిఁగన్నట్లు
సంవిత్తుబుద్ధ్యుపాధినింగను నంతఃకరణప్రతిఫలితంబైనచిత్తు బుద్ధ్యుపాధిని త
న్నువాఁజూచునగ్నియంశంబగునదృక్కు తత్సహాయంబునఁ దన్ను గన్నట్లువృ
త్తిశూన్యంబైన బుద్ధ్యుపాధివశంబునఁ దన్నునాలోకించుచు ద్వివిధంబైనట్లును
ఖంబునంజెందు నాబుద్ధిశక్తియగుచిత్తువాసనాచతుష్టయ మాలిన్యంబు లేకుం
డుటంజేసి బుద్ధ్యుపాధినఁదన్నుఁజూచుకతననంతఃకరణోపాధియుపపన్నం
బగువెండియు బుద్ధిశూన్యమనినచో బోధతోఁగూడెంగావున శూన్యమనంగా
దైననుసుషుప్తియగునా సుషుప్తియగుంగాకయంటివేని నాసుషుప్తినిర్వాసన
మైయుండియు నందేమియెఱుగక పిదపనజ్ఞానంబునొందెడుగావున సుషుప్తి
గానిదేబోధతోఁగూడినఁ దుర్యమాబోధలేకున్ననజ్ఞానంబగును విషయాహం
కారమాలిన్యవృత్తి శూన్యతయబుద్ధి శూన్యతయు బుద్ధి శక్తియైనచిత్తు సంవి
త్తునంజూచుచుసుఖస్వరూపుండగుట బ్రహ్మానందంబునంజొక్కుచు నాబాహ్యం
బుమఱచునప్పుడు జ్ఞప్తిమాత్రుండై బుద్ధిచేఁగాని తెలియరానివాఁడైయుండు
నాసమాధిసమయంబున మనోలయచిత్ప్రకాశంబైననెఱుకదక్క తక్కనప్ర
పంచంబులేకుండు నాసమాధ్యంతరంబున లయంబైనమనస్సునకు బహిర్వ్య
పారంబుగలుగు నెట్లనిన రథంబునదురంగంబులంబూన్చి యభ్యాసమార్గం
బుననడిపించుచు మధ్యేరథికుండూరకుండ యథాక్రమంబుగానడుచునట్లు బుద్ధి
కివృత్తిశూన్యంబైనప్రారబ్ధ నాశపర్యంతంబుగుకళేబరంబుసుఖదుఃఖంబులం
జెందినట్లుండు నాత్మాలోకనపరుండైననాడితరప్రపంచంబుగనియునుంగనని

వాఁడైయుండుననిమఱియు మౌనీంద్రుఁడిట్లనియె ॥సీ॥ బ్రహ్మంబు నేనని పలు
మాఱుననవచ్చు బ్రహ్మబోధమెఱుంగుభావమరుదు। వేదాంతశాస్త్రముల్విభజిం
పగావచ్చు నాత్మార్థముల దెల్పుటదియునరుదు। సర్వంబులును రోసి సన్యాసిన
నవచ్చు శూన్యమార్గంబులోఁ జూచుటరుదు। అసిబద్ధమోక్షంబులని చెప్పగా
వచ్చు దాసుగానిలకడదనరుటరుదు। తనువునర్థంబుగురునికియ్యనగవచ్చు। దారి
మోనసీనలోభంబు దీఱుటరుదు। మనసు సామర్థ్యమెఱిగెడిమర్మమరుదు। అం
తతానయ్యోగాకుండుటదియునరుదు॥ గీ॥ శుష్కవేదాంతసిద్ధాంతసూటిపరు
లు। ఆత్మ నెఱుగక యర్థముల్వ్యర్థముగను। జెప్పుచుందురు లోకుల జెఱుచుకొ
ఱకు। నిజముసిష్ఠూరమైనకల్లనిజములాయె॥ మ॥ అరయన్ బ్రీతిపరాశరాత్మజు
డు బ్రహ్మానందవర్షంబుగా। గురియించెన్నిబిడీకృతామృతలసత్కోలాహలో
ల్లాసిమై। గురుకారుణ్యమహాప్రభావమున గోర్కుల్దీఱియుం గోరబ్రహ్మరు
షీంద్రుండలరాజుతోననిమెహాజ్ఞాధుర్యచాతుర్యుడై॥

మ॥ మనుజేంద్రాగ్రణి యట్లనారదుఁడు రామస్వామినింగూర్చి చాలన
మస్కారముల్ప్పజేయుచునుతుల్గావించె దత్స్వరూపుని। దేజోమయు సూ
ర్యమండలగతున్ బూర్ణాత్మునాదిత్యవర్ణుని లోకేశు బురాతనున్మలినహీ
నున్బుద్ధినూహించుచున్॥ గీ॥ రఘుకులాధీశు లోకాభిరాము విష్ణు। నజు నపార
చిదానందు హరి ముకుందు। బరమపరుఁ డౌచు నేకమై పరగువాని। సంవిదాత్ముని
శ్రీరామచంద్రు దలతు॥ గీ॥ మునుల కెల్ల జాలధనమైనవానిని। బాపములను జె
ఱుచు పరమపురుషు। నన్నితానెయగుచునన్నింటికధికమౌ। వానిదలచి మ్రొక్కు
వాడననుచు॥ గీ॥ సారెనారదుండుసంభ్రముల్గడుచుచు। మఱియు మఱియు
రామమహిమదలచె। మమతగలుగువారిమర్యాదగాబోలు। మఱిగితిరిగి యా
డు మాటలాడు॥ మ॥ హరిరుద్రాదిసురుల్నవగ్రహములష్టాంగాదియోగవ్రతు
ల్ధరవర్ణాశ్రమయజ్ఞదానజపసంధ్యావందనాదిక్రియల్। చరణుల్సప్తసముద్ర
ముల్త్రివిధదీక్షల్బ్రహ్మవిద్యాధురం। ధరుల న్వేదపురాణశాస్త్రములు సీతా
రామనీవే కదా॥ గీ॥ అనుచునిట్లుసూక్ష్మునఖిలాంతరాత్ముని। శాంతునీరజాక్షు
సత్యధనుని। బ్రహ్మమూర్తియైనరామచంద్రస్వామి। సన్నుతించుచున్నసమ
యమునను॥ సీ॥ శ్రీరాముడప్పుడు నారదు ముందరనిలిచిమౌనీంద్రనేనీవు సేయు
సన్నుతుల్మెచ్చి ప్రసన్నుండనైతెనిష్టార్థముల్వేడుమిత్తననిన। నారదుం డి
ట్లనె నానుతికిష్టంబునీమూర్తిగన్నదే నేడు నేను। ధరగృతార్థుడబుణ్యధన్యుండ
ఘనుడనాజన్మమిప్పుడుచాలసఫలమయ్యె। దఱమీదేఱెబండెనుదపముల్లెల్ల నన

ఘుమీపాదదర్శనమబ్బినప్పుడె । నిమ్మళలంబాయెనద్వైతనిజమునేడు । స్వచ్ఛ
మైనట్టినీనామజపముచేత॥ శా॥ ఈరీతిన్ గొనియాడునారదుని దానీక్షించి స
త్ప్రీయునిం। కన్నావోయివరంబు వేడుమను నా కాకుత్స్థుతో మౌనినిన్ । జేరేది
త్స్వానికోరనిచ్చెదయతో శ్రీరామచంద్రుండయో। ధ్యారాజ్యంబునజానకీసహి
తుడైధర్మంబుపాలించుచున్॥ సీ॥ ఇదిరాఘవ స్తవంబిదియుత్తమోత్తమంబిది
సర్వసౌభాగ్యమిదియుముక్తి । ఇదినారదప్రోక్తమిది వేదసారంబు నిదిరహస్య
శ్రేష్ఠమిదిశుభంబు । నిదితపస్సారంబునిదిపుణ్యపాకంబు నిదిత్రికాలంబునజదు
వువారు। పుత్రమిత్రకళత్రపౌత్రాదివృద్ధియు నిచ్చకల్యాణంబుపచ్చతోర । ణ
ముబుపాడియాబంటసంభ్రమములింట । గలిగియుందురుసంపూర్ణకాముల
గుచు। బుద్ధివాక్కాయకర్మములపూర్వకర్మ। మైననటుదుపఠియించునట్టివారి॥
క॥ గీతానామసహస్రము। సీతారామస్తవంబుశ్రీగురుకరుణ। న్బ్రీతినిబఠించు
నునెవ్వం। డాతనినారాయణసముడంద్రుమహాత్ముల్॥ వ॥ అనియిట్లువ్యాసుం
డుధర్మజునకెఱింగించననినవిని సంతుష్టాంతరంగులై శౌనకాదిమును లటమీది
వృత్తాంతంబేమిచెప్పెనెఱుంగింపుడనిన॥ క॥ వేదాంతతత్త్వనిశ్చయ। వాదా
స్పదధర్మచరితవసుదేవసుతా। వైదర్భీసత్యాత్మా। మోదక్రీడావినోదముర
ళీనాధా ... ... ... ... ... ... ... ... *

మాలినీ॥ సముఖఘనవిలాసీసుప్రసన్నాత్మవాసీ । భ్రమతిమిరదినేశా
భక్తలోకప్రకాశా । అమితగుణచరిత్రాయార్యసుస్తోత్రపాత్రా। వి
మలప్రణవసీమావృష్ణివంశాబ్ధిసోమా॥ ... ... ... *

గద్య॥ ఇది శ్రీరామచంద్రవరప్రసాదలబ్ధకవితావిలా
స శాండిల్య గోత్రపవిత్ర కృష్ణయామాత్యపుత్ర వినుతగుణ
శ్రీ మల్లనార్య ప్రణీతంబైన శ్రీరామ స్తవరాజంబను మహా ప్రబం
ధంబునందు హరిధ్యానపురస్సరంబైన శ్రీరామ కృష్ణస్తోత్రం
బును ధర్మజుండు సుజ్ఞానభక్తికర్మప్రశంస జేసిన వ్యాసభ
ట్టారకుండు సవిస్తరంబుగా దత్తద్ధర్మంబులం దెల్పి
టయున్నది- ప్రథమాశ్వాసము.



శ్రీరామజయము.

# శ్రీ రా మ స్త వ రా జ ము.

ద్వి తీ యా శ్వా స ము.

శ్రీమద్ద్వైభవకారణ।
ధీమన్నుత దేవ దేవదివ్యమునీంద్ర।
క్షేమంకర వేదార్థ।
ప్రేమాస్పదజనవిహారి శ్రీకృష్ణహరీ॥

వ॥ ఏవాసూతుండు శౌనకాదిమహామునీంద్రులకిట్లనియె నట్లుశ్రీకృష్ణ ద్వైపాయనుండు కౌంతేయాగ్రజుం గనుంగొని సర్వ ప్రపంచంబు మనోవి కారంబు గావున మనస్త్యాగంబుసేయవలయు దన్మనస్త్యాగంబునకు గురుసేవ కారణంబనియిట్లనియె॥ గీ॥ తల్లితండ్రిలేనితనయునిపోలికె । సతికిబతియులేని చందముననుఁ। గురువులేనివిద్యకూడ దెందులకైన। నజునికైననిజమునరసిచూడ॥ గీ॥ తల్లిదండ్రిగలరుతగజన్మజన్మాన । నరయబంధుమిత్రులట్లకలరు । తన్నుదె ల్పుగురుఁడుతగదొరకడుభువి। దొరుకుటెల్లముక్తిదొరుకుటధిప॥ గీ॥ తల్లిదం డ్రిఋణముదైవఋషిఋణమును। దన్నునెరుఁగదీరుతత్త్వమందు । బరమగురుని సేవపాటింపకుండెనా। ఋణముదీరదండ్రుదురాఢిమునులు॥ గీ॥ సూచకనిషిద్ధ బోధకవాచకులను। గడగికామ్యకర్మసమయకారణులను । ననగనైనమంత్ర దేశికులందులోన। సద్గురుండగుకారణాచార్యవరుడు॥ గీ॥ అట్టికారణగురురా యడైనవాడు। రామభగవానులేకానిసీమలోన। నితరజనులుతమ్మెఱుగంగనెం తవారు। నరుడుగురుఁడనిపలుకుట న్యాయమధిప॥ సీ॥ సద్గురుధ్యానాత్మసంప న్నుడగువానినరకాలిద్రావాతమెవ్వనికిలేదు । సతతంబుకారణాచార్యుజేరినవా నికొనగోరబోలనెవ్వనికిగాదు। శ్రీగురుశుశ్రూషసేయనేర్చినవానిచరణరేణు వుసమంబెవరుగారు । దేశికప్రీతిగాదిరుగనేర్చినవాని సరిసహస్రాంశమెవ్వరు నుగారు। దానమానచాంద్రాయణధ్యానవిహిత । మంత్రతంత్రాధ్యయనజప మర్మకర్మ। తీర్థయాత్రాదికస్నానదివ్యధర్మ । లైననాచార్యుజేరినవారిసమ మే॥ క॥ గురుశుశ్రూషలుసేయుని నరకడుసంసారమనెడినట్టటముణెం।, గిరు

యస్థపుబాంధైయిహా। పరములులేకుండునెందుబకుకర్మంబై॥ క॥ గురుబోధ
నెఱిగినట్లా। పరిపరివిధమైనశాస్త్రపారవ్యసనం। బెఱిగించునెపురుషార్థము।
పరిపక్వముగానివారిభ్రాంతులుగాగ॥ క॥ పరసత్తములనుకారణ। గురుచే
తను దాను దెలియగూడినయట్లా। నరకప్రసిద్ధవాసన।కిరవౌపారవ్యసనము లెరు
కతునగునే॥ వ॥ అనినవ్యాసభట్టారకునకుధర్మజుంజిట్లనియె॥ క॥ అయ్యాగురు
వులచరితం। బెయ్యవి నేతరువారలెవ్వరుచెపుమా। నయోగ్యపాతర తెలియదు।
అయ్యాశ్రమధర్మమెట్లులాచారంబుల్॥ క॥ కారణగురుమహిమంబులు। వారికి
శుశ్రూషసేయువర్తనలన్నిగ। దేమగడసేయవయ్యా।సూరిజనస్తుత్యచరితసు
స్థిరభరితా॥ సీ॥ అవిగాకబహువిధంబైనసంసారము ల్వారలనడవళ్లుపౌరుష
ములు। మాయాశరీరమర్మంబులుపురుషుండు రమణులవీడువిరక్తిత్రోవ।మో
క్షాధికారముముక్షుండుకారణాచార్యుజేరెడుజాడసాంగముగను। దెలుపు
ముమఱిమేమి తెలుపంగవలయునో నన్నియానెఱిగింపుడనునృపాలు। తోడ
వ్యాసుండుసెప్పంగదొడగునిట్లు। రాజయోగంబు తెల్పుకారణగురుండు। వాని
మహిమలుసంసారవర్తనములు। ముందుగాదెల్పుమంతకు మున్నెతెలియ॥
క॥ మాయాసంసారంబులు।రోయకగురుమహిమదెలియరూఢులుగలవా।కా
యమనిత్యంబనిగురు। రాయనిచేబడకతమకుబ్రతుకులుగలవే॥ ... ... *

*( జీవవిచారఘట్టము. )*

సీ॥ జీవునిసంసారిచిన్నెలామూలాగ్ర ముగజెప్పెదనువినుమొదలమొనల।
స్వప్రకాశమువనుచనునహంకారమా వరణవిక్షేపమైస్వస్వరూపు। మఱపిం
చుపురుషునిభ్రమగఱపించిన నిందుచేనెద్దియునెరుకలేక। వెనుకముందెరుగక
వెట్టిపట్టినవానివిధమునవాసచే వెతలబడుచు।వెతలుపోనుకొంచుగొదవనిమో
హాంతి। శయాముచేతపట్టిజాలిగోడు। గుడుచుచుండుగాకఝుడిసియింతటనైన।
తోడుసుమాలిపోదుదుఃఖజీవి॥ క॥ ఆవరణమనగమఱపే। కావునదానన్నద
న్నుగానకయుండ। న్నెవిధమునదాననతా। నైవేఱుభ్రాంతిపెట్టునాత్మనివ
త్సా॥ క॥ విక్షేపశక్తియనగా। మోక్షవ్యతిరిక్తమైనమోహవికారా।ల్లక్షలప
ర్యంతంబుల। రక్షణమునదోచుగాపురంబులకిరవై॥ అదియునుంగాక॥ క॥ జీ
వుండిట్లుతనుత్రయము। భావనచేగలిగెవానిప్రకృతుల్వీనుమా।కైవల్యంబునదబ్బ
ర।గావేగొకకల్పితుండుగలిగెన్నృపాలా॥ క॥ అనవినిరాజేంద్రుండును।ననఘ
నిరాకారమునసాకారంబే। యనువునగలిగెనుజీవుడు। తనువులుమూడెట్లు
డాల్చెతద్విధమెల్లగ॥ గీ॥ తెలియజెప్పుమన్నదేశాధిపతితోడ। మునికులాబ్ధిచం

ద్రుఁడనియెనిట్లు॥ రాజవర్యా వినుము బ్రహ్మస్వరూపంబు। మొదలుగాను బోధప
దిలపరతు॥ అదియెట్లంటేని॥ సీ॥ అమలమై స్వచ్ఛమై యాద్యంతశూన్యమై శుభ్ర
మై ఘనసంవిదభ్రమగుచు। నిత్యమై సత్యమై నిర్మలాకారమై యఖండమై యానంద
కందమగుచు। పూర్ణమై దివ్యమై బోధస్వరూపమై బుద్ధంబునై స్వతస్సిద్ధమగుచు।
నమితమై నిర్వేద్యమై నిరంజనమై పరంజ్యోతియై మహారణ్యమగుచు। నద్వయబ్ర
హ్మచైతన్యమై వెలుంగు। నట్టి బైటను సేమిగన్పట్టు బొట్టు। లైనయిబ్బంది తెల్విలై
లేని దేక। లిగెననవల నెరజ్జుసర్పగతిననఘ॥ క॥ లేకే కల్గినపురుషుడ। యాకల్పి
తుడనగ యాతడౌ దబ్బరసా। లోకించి తామహత్త। త్త్వాకారంబైనయీశుడ
య్యెందీనఘ॥ క॥ అయ్యాయుత్తమమధ్యమ। నియ్యోహంబనెడి నహాముని గుడె
న్వినుమా। వెయ్యేలిక నియ్యోహం। జైయొప్పెడి భౌతికాఖ్యాహంకృతివలనఘ॥
గీ॥ ఆదిశక్తియుక్తుడైత మోగుణియునై। జ్ఞానవికృతితోడ గానబడుచు। కడక
తోడ విశ్వకారణదేహియై। రూఢికల్పితుండు రుద్రుడయ్యె॥ క॥ ఖ్యాతిగ భూతో
త్పత్తికి। యాతడె యాత్మస్వరూపుడౌ భూతాత్మా। యాతని చూపే కాలం। బే
తరినిండిన నుకల్మి నెరుగుము బయలో॥ గీ॥ గగనవిస్తీర్ణమై గాలిగాలి చుట్టి। పట్టి
మధియింపగా నగ్నిపుట్టె దీని। యూరము జలమంద్రు వేత్తలు యొప్పతోడ। నట్టినీ
రంబు బలుపయా యవనిననఘా॥ క॥ ఈరీతి పంచభూతము। లారయ కల్పింపఁబ
డియెననికలయఁబం। బారూఢంబిది వ్యష్టిశరీరంబనిపించుకొను సుపృధ్వీనాథా॥

## ( పంచీకరణలక్షణము. )

వ॥ వినుమా పంచవింశతితత్త్వనిర్ణయం బెట్లన్న నీపంచభూతంబుల
నొక్కొక్కటి రెండేసిగా విభాగించి యందులో నొక్కొక్క నిజాంశంబులుం
చి తక్కిన నొండొంటి నాలుగేసిగా భావించి పంచికలయఁబంచీకృతంబయ్యెఁగత
ద్విధంబెట్లన్న ఆకాశార్ధభాగంబు జ్ఞాతృత్వమయ్యె తక్కిన నాల్గును వాయ్వ
గ్నిజలభూములఁగూడి మనోబుద్ధిచిత్తాహంకారంబులయ్యె పవనార్ధభాగం
బు వ్యానమయ్యె తక్కిన నాల్గును పృథ్వ్యప్తేజోనభంబులంగూడి ప్రాణా
పానోదానసమానంబులయ్యె హుతాశనార్ధభాగంబు చక్షువయ్యె తక్కిన
నాల్గును భూనీరమారుతవ్యోమంబులంగూడి ఘ్రాణజిహ్వాత్వక్ఛ్రోత్రంబులయ్యె
కీలాలార్ధభాగంబు రసంబయ్యె తక్కిన నాల్గును ధాత్రీకృపీటప్రభంజనశూన్య
మార్గంబులంగూడి గంధస్పర్శశబ్దంబులయ్యె క్ష్మాతత్త్వార్ధభాగంబు పాయూ
వయ్యె. తక్కిన నాల్గును వారిధనంజయసమీరాంతరిక్షంబులంగూడి. గుహ్యపా
ణిపాదవాక్కులయ్యె యిట్లు పంచవింశతితత్త్వాత్మకంబైన స్థూలదేహంబింక

కర్మజ్ఞానేంద్రియదశకంబును పంచప్రాణమనోబుద్ధులంగూడి సూక్ష్మాంగంబ
నులింగశరీరంబయ్యె నీరెంటికికారణంబగుటనవిద్యకారణాంగంబయ్యెనీదేహ
త్రయంబులంగూడిజీవుండుజాగ్రత్స్వప్నసుషుప్తులను నవస్థాత్రయంబులంబడి
పొరలుచు మాంసనిర్మితంబైన యీస్థూలకాయంబునందహంకార మమకా
రంబుసేయుచు దేహాత్మాభావంబుల తన్నుదా నెఱుగకకర్మంబులు చేసిస్వర్గ
నరకంబులం బొందుచు క్షీణభోగంబుల సర్వజంతుయోని ద్వారంబులం బు
ట్టుచుంజచ్చుచు నెడలేనిదుఃఖంబులంబొందుచుండుగాని సర్వభోగవిరక్తుం
డై శాంతహృదయుండగుచు యీశ్వరో పాసనావిశేషంబుల చిత్తంబుగ
ల్వనేరడదెట్లన్నవినుము॥గీ॥ చీమునెత్తుర్ల చేతను చిఱుకుచుండు। మూత్రమణ
సంఘాతంబుపై మురికితోలు। కండలెంములుప్రేవులు నిండియుండు। యిట్టిదే
హంబులందవస్థేమిచెప్పుమ॥ సీ॥ బయిసిహీనముదుఃఖబహుళమాకారంబు
వెంగిలిమంగలభంగభూమి। తేరనవ్వులపోతు దేహస్వరూపంబుకోగాలపు
ట్టయిశోతకొంప। భయములపుట్టిల్లుపాతకంబులబొంది యముబారిగొత్తె
యీయలతియొడలు। మలమూత్రరక్తదుర్మాంసమీచెడుడొక్క కసుమాలిబా
ములీకష్టతనువు। తోకపురుగులగుంటయీతోలుతిత్తి। యిడుముపాటులకొడి
గట్టుయీశరీర। మందలాకాంక్షసౌఖ్యముందుగోరి। కోరిశుద్ధపశుప్రాయు
లైరిజనులు॥ సీ॥ గుణములులోభములా[కర్ణ]ములుగరిశలు యీశలు తలతోక
యవధినోరు। సకలావయవములుసంగత్రయంబులు కులగోత్ర సంగాధనము
లుపొలంబు। మందుసంసృతిదొడ్డమమతకర్మముగాడిపంచేంద్రియంబులుబల్మి
పలువు। పూరియావిషయముల్క్రూరముస్నేతలుప్రేమాతిశయములు పెద్దతో
ట్టి। ఋణముసుఖదుఃఖముబాధలుగోతకుడితి। కాపురముచెడుమోహంబె క
ల్లతెల్వి। బ్రహ్మమందునదోచినభ్రాంతిగొల్లు। మనుజులనుపశువులకిట్లునసఘచ
రిత॥క॥ ఈరీతిబశుప్రాయులునైగోపద్వేషులైదురాచారులునునై। వారును
వీరునుమీమా। వారనిస్త్రీవాంఛదగిలివశులైరిన్నపా॥క॥ ఆఃబంబిడ్డలకొరకై।
జాలింబడిధనముగూర్చిచచ్చినదనకా। వేలాకోలమునొందును। స్త్రీలోలుండై
నవాడుచెడిపోబాడై॥గీ॥కాంతదగిలినవారికిగలదెసుఖము। వారిపోషించుటకు
చాలవనరివనరి। తిరిగితెచ్చినయువిదాముదిన్నవెనక। వెంగిలైననుభక్షించుటి
ట్లుగాక॥సీ॥ బహువిధశోకంబు భార్యానుభోగంబుసిగ్గులచేటునీస్త్రీలకూట।
మత్యంతపాతకంబంగనాసంగమంబిహపరదూరంబులింకి పొందు। దుఃఖస్వ
రూపంబులోయజేతుణపొందులుద్బంధమరణంబులువిదచెలిమి। అతిఘోరనర

కంబుసతులలోలత్వంబుతలయె త్తరాములుచెలులగోష్ఠి। గాపురించెడిసంసార కష్టపాటు। రోతకూటిబ్రతుకరణ్యరోదనంబు। లేమిజెప్పదులేహ్యామంచెరిగి దీని। సన్న్యసించినవాడెబోజాలుడధిపా॥ సీ॥ యిల్లువాకిలిరోసియిల్లాలినెడబాసిచుట్టపక్కములనుసారివిరోసి। వన్నెవాసులువీడివాంఛలుగోరాడసౌంములుదిగనాడిజోలివీడి। యాడికస్తోకోర్చియవమానములునోర్చినడవడిపోకార్చితోడుసుదీర్చి। కర్తృత్వములుమీరికర్మముల్గడతేరిభావంబులనదీరిభ్రమలగోరి। నితరసంగంబులెల్లనునేహ్యాకుడిచి। యతిమహాశూరుడైయింటియాశవిడిచి। తిరిగిచూడకదాబయట్లేరినడచి। పరమపదముజేరజన్మసాఫల్యమనఘ॥ సీ॥ సంగవిరక్తుండుశృంగారయుక్తుండు సంగవిరక్తుండుసర్వజ్ఞుడు। సంగవిరక్తుండుబంగారుబిడ్డడు సంగవిరక్తుండుసర్వసముడు। సంగవిరక్తుండుసంతతానందుండు సంగవిరక్తుండుసంభ్రముండు। సంగవిరక్తుండుసంపూర్ణకాముండు సంగవిరక్తుండుసన్నుతుండు। సంగవిరతుండుచిత్తరశాంతిపరుడు। సంగవిరతుండుదేవతాసముడుఘనుడు। సంగవిరతునిసరిసాటిజగతిగలరె। సంగవిరతుండుపూజ్యుండుసభలలోన॥ ఉ॥ ఈవరగర్వముంవిడచియీశ్వరునందుప్రీతిఘట్టిగా। భావననిల్పియాడుచునుబాడుచుశ్రీహరినామకీర్తనల్లావుగజేయుచున్నజనులంగనునెవ్వడుజేరువానిజే। జీవనముక్తివేకమునుసిద్ధముపాండవవంశపావనా॥ గీ॥ పాండవోత్తమవినుపరబ్రహ్మమైన। రామకృష్ణులనామకీర్తనలమహిమ। లేమిజెప్పదుధాత్రిలోనెవ్వరైన। వాంఛనొకమారుబల్కపావనులజేయు॥ ... ... ... ... ... ... ... ... ❋

**—❋( నామకీర్తనవిచారఘట్టము. )❋—**

గీ॥ నామకీర్తనసరిసాటిభూమిగలదె। తెలియనేరనిమూర్ఖులుతీర్థయాత్ర। లంచుదేవతాసేవలట్లంచునుండ। బట్టకతిరుగ్రహచారబాధగాక॥ క॥ జారుండైననువృద్ధా। చారుండైననుగృహస్తసంచారుండై। శ్రీరామాయనియొకపరి। నోరాడినజాలువానిదూరేడులకున్॥ సీ॥ తెల్లవారకతొల్లిచల్లనినీటలోవాయుకొవాడలెల్లవణుకువారు। నీరుకావులుగట్టినీళ్ళుదర్భలచేతసవ్యాపసవ్యముల్జల్లువారు। బిగుసుకముక్కులుబిగియించిగొణుగుచుమూగన్నువేయుచుతూగువారు। సాముజేసినయట్లుసాగిలబడిపడిప్రొద్దుకైనిల్వకబోవువారు। బిరబిరనుచెట్లచుట్టునుదిరుగువారు। నెయ్యిజిదుగులునగ్నిలోవేయువారు। వైశ్యదైవాధిపూజలవరలువారు। కీర్తనలుసేయువారలకిందివారు॥ క॥ ఆత్మావేశముచేహరికీర్తనపరుడైనవాడుకృష్ణాయనుచున్। మూతిగాభజించినయొక్క

ము । హృత్తమములో స్వామియెుద్దయుంచుకయుండఁగ॥ సీ॥ అనిశంబునారా
యణాయని చెలరేగియాటపాటలమఱుమాటలేక । పిలుచుచు ప్రత్యక్షములుగో
రితలచుచు ధ్యానించి పరవశత్వమునఁబొంది । తెలిసి మఱచినయట్లు తెలియక మఱు
పుతో నెందు నెట్లుండుట నెఱుకపడక । నున్నచోటను తనకుండంగ సైపక బాలుని
లీలనిర్భయుఁడునగుచు । తిరుగుభక్తిని వెనువెంటఁదిరుగుచుండు । తడవులకుగన్న
శ్రీరాముతల్లి బోటి । ముగుదసుతుచాయఁజాలని ముద్దులట్లు । పరమకారుణ్యనిధి
యైన హరిన్ కృపాలా॥ క॥ వినవయ్యా రాజచంద్రా । మనుజశరీరంబులెస్స మంచిది
యౌగా । పునఃపురుషార్థము గనుగొను । ఘనులకునల్లాను ముద్దుగా విహరించున్॥
మఱియును॥ క॥ శ్రీరామకృష్ణులకు పని । ధారుణిసేవరై నతంముదలచిన వారిన్ ।
జేరే జేదయు చేతను । నారయుమిందొక కథగలదది వినుపింతుఁగ॥ క॥ నారదము
నిశిష్యుండా । త్మారాముఁడు విప్రముఖ్యుఁడాతండొక నా । డా రామకృష్ణమూర్తుల
లు । జేరెన్ నోర్పప్పవారు జేరిరి వానిన్॥ క॥ ఈరీతి బలుక వానికి । నారాజేంద్రుం
డునని యెనయ్యా వాఁడే । తీరునఁజేరెను జేరిన । వారేరీతులను జేరవచ్చిరి వానిన్॥
వ॥ అనిన కృష్ణద్వైపాయనుండిట్లనియె॥ గీ॥ శరణు శ్రీజానకీనాథ శరణు శరణు । శ
రణు శ్రీరుక్మిణీనాథ శరణు శరణు । శరణు శ్రీరామ రఘురామ శరణు శరణు । శరణు
శ్రీకృష్ణ హరిహరీ శరణు శరణు॥ వ॥ అనుచు భూసురుండు శ్రీమన్నారాయణమూ
ర్తిని గూర్చి యిట్లనియె సచ్చిదానందనిలయా నీవు రామావతారంబున బాలుం
డవై యుండు నెడ విశ్వామిత్రుండు తనయాగసంరక్షణంబుకొఱకు మీపట్టణంబు
ప్రవేశించిన నతనిం జూచి యీ దేహేంద్రియాది ప్రపంచంబుకొఱకు సర్వంబు
గాంక్షింపవలసెగాని దీనివల్ల నయ్యేడు సుఖంబు లేదట్లన్న "నాత్మవస్తుకామా
య సర్వం ప్రియం భవతి యని" వేదవచనంబు పలుకు గావున కామంబులు నిరర్థ
కంబులై యుండునని మిమ్ముం జూచి విశ్వామిత్రుండు ఓరామా యీదేహాకీదే
హంబు సుఖదుఃఖమూలంబగుట నిశ్చయింబందులకు నొక్క యితిహాసంబుగలదు
తొల్లి శుకుండు తండ్రిచేత ననుజ్ఞాతుండై మిథిలానగరంబు ప్రవేశించిన నతనిం జూ
చి జనకుండిట్లనియె నీవు సంశయింపవలదు నీకు దేహేంద్రియాది ప్రపంచంబుగ
లిగినట్లయుండుగాని నీకు దేహంబు లేదు నిన్ను నీ వెఱుంగుమనిన నతండట్లచేసెఁగా
వున రఘువీరా నిన్ను నీవెఱుంగుమనిన మీరు నేనే బ్రహ్మమని యెఱింగితిరటమున్న
ని న్నెఱుంగంగ వేనీవు గురుశిష్యన్యాయంబు నడిపించుట తేటబడియెను సహాయాం
త విచిత్రంబది యునుం గాక మారీచసుబాహువధయును శంకరుధనుర్భంగంబు
ను సీతావివాహంబును పరశురామపరాక్రమభంజనంబును అయోధ్యాప్ర

శంబును కైకేయీకారణంబున దండకారణ్యప్రవేశంబును సీతావియోగంబు
ను పంపాసరోవరంబున హనుమద్దర్శనంబును సుగ్రీవసంభాషణంబును వాలి
హరణంబును సుగ్రీవరాజ్యాభిషేకంబును జానకీశిరోరత్న పరిగ్రహంబును స
ముద్రబంధనంబును విరూపాక్ష ధూమ్రాక్ష అతికాయ మహాకాయమహో
దర మహాపార్శ్వ కుంభనికుంభేంద్రజిత్తాద్యనేక దానవ కోలాహలంబునురా
వణకుంభకర్ణ ముఖ్య రాక్షసహరణంబును విభీషణలంకారాజ్యాధిపత్యంబు
ను జనకపుత్రింగూడిసకలపరివారంబుతో భరద్వాజాశ్రమ ప్రవేశంబును గు
హభరతశత్రుఘ్నదర్శనంబును పౌరజనసంభ్రమోత్సాహంబును గురుమా
తృజనప్రియంబును సకలజనసంభ్రమోత్సాహంబుతో నయోధ్యాపట్టాభిషి
క్తుండవై భక్తవాత్సల్యంబుతో సుఖంబుండి తనిదీపించి మరియుకృష్ణావతారం
బున ననేకపరాక్రమంబులుచేసి పదారువేలనూటయెనమండ్రుస్త్రీలతోడం
గూడి క్రీడలంజెలంగు దేవుండవు నీవుకావె యట్టినీకుననేకనమస్కారములుచే
సెద చేకొనవే శ్రీరఘువీరా సచ్చిదానందనిత్యపరిపూర్ణప్రభావస్వరూప॥
గీ॥ అనుచు విప్రముఖ్యుడా రామకృష్ణుల। పాడియాడుచుండె భక్తితోడ।మరియు
శరణటంచుపరిపరివిధముల।పాండవాబ్ధిచంద్రపలికెనిట్లు॥ ... ... ❋

## ——❋( శ్రీరామస్తోత్రఘట్టము. )❋——

మ॥ శరణన్నంగరుణింతునన్నబిరుదఃల్జాలంబులోచాలెనో। శరణోహో
యనరావదేమివినవో సంసార తాపత్రయం। బెరుగన్నీయదోనిందులేవా చెవు
మాయూనిర్దయాబుద్ధినే। మరితోమున్నువిభీషణాదులకు రామాయాతణ రక్షా
మణీ॥ ౧॥ పరగేరావదెత్రోవగానవాసురల్ప్రార్థించికోసామగా।నరుడిక
సాక్షితోయాంజనేయునివడిన్ నమ్మించితో జానకీ। చరణాబ్జంబులునోచ్చెనో
యితరదేశప్రాణిసంరక్షనే। మరితోమెందుకుయింతసేపుదగరామాయార్త
రక్షామణీ॥ ౨॥ శరణన్వారలయాపదల్పరిహరించక్ రాముడుండంగనే। వెర
పేలంచునుపిన్నపెద్దలుబుధుల్వేదాంతశాస్త్రంబులు । న్నోరయన్నమ్మివిభీష
ణాదిఘనులన్బ్రోషించుటల్సాక్షిగా। మరినిన్నమ్మితికావుమీదయను రామాయా
ర్తరక్షామణీ॥ ౩॥ పరులన్ శిష్యులసల్లి దండ్రిగురుబ్రాహ్మణ్యంబులన్సఖ్యులన్।
శరణన్వారికినిన్నునేసహగనాస్వాభావికల్పంచన । ల్వైరవుంగావుననాస్వధ
ర్మమిదిగోనేమానసీధర్మమే। మరకాపన్నశరణ్యనీశరణు రామాయార్తరక్షా
మణీ॥ ౪॥ ధరలోదోల్లిటివారునేనుసహగాదైన్యంబునన్వేదమా। ల్వైరపేలం
చునునియ్యవేయభయముల్నేడేమివింతాయనా । శరణర్థిన్ దిగనాడరాదెరు

గవాసర్వేశనీవిచ్చయే।మరినన్వల్లనువారలెవ్వరిక రామాయార్తరక్షామణీ॥౫॥
శరణన్నాక్షణమే విభీషణునకా చంద్రార్కమౌనట్లు దేవరలంకాపురిదారబో
స్విరనుచు న్వాల్మీకి రామాయణా। దిరహస్యంబులు దెల్పుటన్నిజములై తే నన్ను
క్షింపుమీ। మనుమాటాడిననింకయాననువిరామాయార్తరక్షామణీ॥౬॥ అ
లనాడార్తిని బిల్వ నాకభయమాయాకాశవాణిధ్వనిన్।బలుకావాక్యముసత్య
మాజయమునాభాగ్యంబునాదెట్టిదో। దెలియన్నేరక విన్నవించితిని యేతీరైన
నున్ బ్రోవు। నిర్మలనీవేగతి కావవేదయను రామాయార్తరక్షామణీ॥ ౭॥ శర
ణాపన్నశరణ్య రాగదవె హెచ్చానామనస్తాపము। లిన్నిరసించిన్నినీకుకట్టడగ
దేనీవేగ తేయేమిమున్। శరణంబన్న విభీషణాదులమనస్తాపంబువారింపవే। మ
రినాకెవ్వరునీవయా శరణు రామాయార్తరక్షామణీ॥౮॥ ... ... ❋

## (శ్రీకృష్ణస్తోత్రఘట్టము.)

మ॥ శరణంబింతపరాకు దేవయిదిగో సంసారతాపత్రయం। బరుదైవ
చ్చెనుయింక మాకెవరుదిక్కున్నారునీవిప్పుడే। మరినన్నోమ్ములునోంటనగుసా
వ్య బౌనన్నట్లన్నానెం।దరిమున్ బ్రోచితొనేడుదబ్బరవికృష్ణాయాపదోద్ధారకా॥
౧॥ కాళిందీనదిచెంతనీవు మురళీగానంబుసేయంగనా। వేళన్నాకంతమి మోహ
ముందివగతో వెంటాడనేమంటివో। తాళంజాలకనాడుకుయ్యిడగనంతన్ గాగి
ట. జొచ్చెమె। న్నాళ్ళీ తెప్పనవారిగాచితటకృష్ణాయాపదోద్ధారకా॥ ౨॥ యెవ
[illegible] క్షకుడంచుకుయ్యిడగవచ్చేనంచునాకాశవా। ణివలెన్నేకకూటనుండివస్త్రి
[illegible]గోసినోజనీవేమిసే। తువునాకర్మమునాటికూరకనెయుందున్ చేతగాదేని
[illegible]రా। నవలెన్ తప్పనెయింక నేడహహాకృష్ణాయాపదోద్ధారకా॥ ౩ ॥ ధరలో
తొల్లిటివారుబిల్చినవుడే దాసుండవై వారికిన్। బరగన్ జెప్పదుబంటవై తిరిగిత
ప్పానేడునాపట్లకన్నారగన్నప్పడెయేమివచ్చెయిదినీమోసంబునాకేమియా।
చరణల్తప్పనుయింకనీమనసుకృష్ణాయాపదోద్ధారకా॥ ౪ ॥ అలుకన్గానిపతివ్ర
తల్బ్రియుభయంబత్యంతమునున్ భర్తనున్ । వలదాగుల్కులుగుల్కరల్లరతి
లోవర్తింపవారీతితో వు। త్రులనేడ్పించినగానికొందరికిముద్దుల్రావునారీతితో
నేచలమేలయ్యా పియింజెనీకుమరికృష్ణాయాపదోద్ధారకా॥ ౫ ॥ కరిప్రహ్లాదవిభీ
షణుల్ రవిసతన్ కౌంతేయులన్ ద్రౌపదిన్।మరియున్నాతురులనీవుబ్రోచుటలు
ప్రామాణ్యంబులో నేనివా। మొరయాలింతువులేకయుండినని దేముంమాటికిం
గల్లా [illegible] బ్రఋషుల్దబ్బరనీవబద్ధమికకృష్ణాయాపదోద్ధారకా॥ ౬॥ అలయిం
తప్పదెయిల్లుదూరిసతులన్ [illegible]స్యంబుగావచ్చినా। రలవెన్నల్త్రినిజారచోరతతి

ధూర్తజనస్వామివై నేడు నా। చెలువలే పిల్వగ నేమి రావలసివస్తే నేరికి ఋజులటా నా।
చలమేలయ్యా మహాత్మ హాత్మ నీదు దయ కృష్ణాయాపదోద్ధారకా॥ ౭॥ ప్రతినల్ జేసి
న గాని రావిక నహో పర్యాచకాత్మంచి జేజితకామాతురవృత్తి నేని పరదేశిన్నైని
నేనేని నేగతి లేకుండినవాడ నేని యెవనిం గైకొనివాణ్ణైని సం। జ్ఞతబాపశ్యకృతి నేని
బ్రోవుమరి కృష్ణాయాపదోద్ధారకా॥ ౮॥ గీ॥ అనుచు నిట్లు విప్రుడా రామకృష్ణుల।
జీరజీర తారు స్త్రీలతో గూడ। గూడి చేరవచ్చి కోరిన యర్థంబు। లిత్తు మద్దుమంత
యేమి వలయు॥ *

గీ॥ అనిన వారి నుచితమైనట్టి పూజల। దనిపి విప్రుడని యె ధన్యులార। యితర
మొల్లమీర లిందుండవలెనన్న। సమ్మతించి యుండ్రి సార్వభౌమ॥ క॥ ఈరీతి రామ
కృష్ణులు। నారయ నా విప్రవరుడు హర్షించినయా। చారిత్రమెవరు చదివిన। వా
రికి యీ సుఖము గలదు వసుధాధీశా॥ గీ॥ అనిన మునికి రాజు అశరీరవాణికిట్లు। బ
లికె నన్న మునియు తొల్లి యార్తితోడ విప్రుడభయమిమ్మని శ్రీరామ। చంద్రు వేడు
చున్న సమయమునను॥ గీ॥ గగనవీధినుండి జగమెల్ల మ్రోయంగ। భయపడకుమ
టంచు బలుకు వాక్య। మొకటి వినగబడియె సకల కోర్కులదీర। వాని మహిమ లెం
చవశమె భూప॥ క॥ ఈరీతి గన్నవారికి। శ్రీరాముడు కృష్ణమూర్తి స్త్రీసహిత
ముగా। కోరిన కోరిక లిచ్చుచు జీవనయా వేళ పరిగ చెరవలసె ॥క॥ ఇటువంటి
భక్తిచేతను। కుటిలంబగు చిత్తవృత్తి గోరకము న్నే। పుటుకు నజుండెము డెంచిన
నటనల వేముక్తి గల జెనర నుతచరితా॥ సీ॥ ఇంటితో నైన ఇల్లాలితో నైన సగరిక
ఫ్పులకైన తెగువ జేసి। కావికోకలు గట్టి కచ్చలు బిగియించి హోడితలయై మెడపోచ
దీసి। కుండకోలయు బట్టి నింపు బూడి దెబూసి పూసలు మెడ గొన్ని వేసి చేత। జ
పమాలధరియించి జనులు గన్గొనుచోట హరిహరి యనుకొంచువాడు కొంచు। వే
షమమరంగ భిక్షకు వెంట వెడలి। తిరిగి యమరిక గలచోట తినగ మరిగి। విషయసం
గత్రయంబులో ఏగువాని। కేడసన్యాసమరి వానికేడగతులు॥ సీ॥ కామాంధుడై
కన్నుగానక కంటయినట్టి పణతుల మట్టంబు పడ్డవాని। క్షీణపుణ్యంబున స్త్రీయో
నిజొచ్చి గర్భము నెత్రోవంటుబడ్డవాని। దొలగద్రోయగరాని దుర్జ్ఞాగమిసం
తబైళ్ళనంగడియంటుబడ్డవాని। దబ్బర తాటోట్లతరిగి నాయువు చేతపడిపోవు ప్రే
తంటుబడ్డవాని। దొలిజదువుల ప్రాయశ్చిత్తములను చేసి। దంటబాయక సద్గురు
వెంట ద్రిప్పి। యంటు భాపగ యాలనడిమింటిలోన। గంటుకోరాదు వానికియం
టుపోదు॥ గీ॥ యిన్ని చెప్ప నేల తన్నుదా నెరిగిన। ఘనుని జేరకున్న కర్మమెట్లు। పో
వు వ్యర్థమగును బూడిదెలో హోమ। మైన రేంద్రచంద్ర యధములకునుగచ॥ నడ

కలనాక్రమంబులధనంబులజాతులవర్థనీతులన్। యడవులదానధర్మములనాకు
లనంబులవేషభాషల। న్జడలదిగంబరత్వములచాటుటసద్గురురాజచంద్రుచే। బ
డకనవిద్యయున్జడిసిపాయనెముక్తివధూటిఁజేరునె॥ వ॥ అదియునుంగాక॥ సీ॥
గుడిగుండములకొండగుహలకారడవులకూరలనారలనిరాహారములను। పం
డగపర్వాలపాడినిపంటనునేర్పునేరంబులనోర్పుజనుల। నిప్పులనీళ్లనుచప్పిడుపి
ళ్లనుతెరాలతిరుగాళ్లతిప్పటలను। పడుగులపెండ్లిండ్లవన్నెలవాసులవ్రాతలచ
దువులపాదములను। విందులవినుకూళ్లవితరణగుణముల।పొందుపొరటలనుపో
ఱుములను। మోక్షమబ్బదయ్యముక్తికాంతామణి। నాధుజేరకున్ననరులకధిప॥
గీ॥అనఘయామతించినట్టివృశ్యములకు। తల్లివంటిచిత్తదర్శనమున। చిత్రవృత్తిఫలి
తంబుజీవుడైకనుపట్టె।కాననింతవట్టిమానసుండె॥గీ॥గోతకూటిమనసుగోసాన
కే పెనగు। త్రోవగానిముక్తిత్రోవపట్టె। పోవనీదుదీనిపోడిమియీమాయ। రం
పెలాడిజూడురామచంద్రా॥గీ॥ విషయలోలుడగుచువిశ్వాసవినుతుడై।గురుల
నింతవినుచునుటెఱుడగుచు। చింతమునిగినట్టిశిష్యునకాత్మోపదేశమియ్యరాదు
తెలియనధిప॥సీ॥ ఆలస్యనాస్తికాహంకారపంచకద్వేషవిద్యాచోరదూషకు
లకు। పాషండనిష్ఠురపతితకార్యకృతఘ్నకలహప్రియవిషయగర్వితులకు। స్తం
భనమోహనోచ్చాటనమారణవశ్యకుహకవిద్యనాదులకును। సటలోభమో
హాతిశయకామ్యకరులకుచోదకోర్వనియట్టిపామరులకు। వినయభయభక్తివి
శ్వాసఘనతచేత। గురులశుశ్రూషసేయనిక్రూరులకును।స్వస్వరూపోపదేశం
బుసార్వభౌమ। యెన్నివిధములకైనన్నియ్యంగరాదు ॥చ॥ అనవినిధర్మజుండనె
మహాత్మకయుందధికారలక్షణం। బునగురుసేవలక్షణబుద్ధిగజెప్పుమటన్నరాజు
తో। మునివరుడిట్లుపల్కెనుముముక్షులమార్గముయోగచర్యలు। న్వినుతసుఖ
స్వరూపమునువిచులవిందుగవాక్చమత్కృతిన్॥వ॥ ఇట్లనియెరాజేంద్రాసాధ
నచతుష్టయసంపత్తిగలయతండధికారి పానిలక్షణంబులునిత్యానిత్య వస్తువివే
కంబును యిహాముత్రార్థఫలభోగవిరాగంబును శమాదిషట్క సంపత్తియును
ముముక్షుత్వంబులనంబడు తద్వివరంబాత్మనిత్యంబుజగంబులనిత్యంబులని యె
రుంగుటనిత్యానిత్య వస్తువివేకంబనుసాధనంబు అందులస్రక్చందనాదివనితా
భోగంబులుతుచ్ఛంబులుస్వర్గాదిలోకసుఖంబులునట్లయుని యిహపరసౌఖ్యంబు
లుగోరకుండుట యిహాముత్రార్థభోగవిరక్తియను రెండవసాధనంబంతఃకర
ణనిగ్రహంబు శమంబుబాహ్యపంచేంద్రియంబనగ్రహంబు దమనంబనంబడు
కామాద్యరిషడ్వర్గంబులయుండుట క్షాంతియనిపించుకొనునుత్రుత్యాచార వి

శ్వాసంబుగలుగుట శ్రద్ధ యనిపించుకొనును ఇట్లు శమాదిషట్క సాధన సంప
త్తియును మూడవసాధనంబు బ్రహ్మంబెరుంగ గోరుటయు ముముక్షుత్వంబను నాలవ
సాధనంబిట్లు సాధనచతుష్టయ సంపత్తిగలయతండధికారి యనిపించుకొనునని
మరియునిట్లనియె॥ సీ॥ ఎవ్వడనేజగంబెట్టిది సంసారమెవ్వనికర్త యెందుగలిగి
యెందునున్నాడనో యేరూపువాడనో యెచందమేమందమేత్రోవ। యొకనా
టికినేను యున్నయున్నట్లుగాకన్నవారలలోనకలసిమెలసి। దలయెత్తగలుగు
నాదైవకటాక్షంబులేరీతినున్నదో యెవ్వడుగలడో। యనుచు దేహాదికభ్రమల
న్విడిచి। వేదవేదాంతవేత్తలవిభవమెరిగి। నేడుగడయౌనుగురుడంచు నెంచు
వాడుస్వస్వరూపోపదేశార్హజనుండుభూప ॥వ॥ అనియిట్లు వేదవ్యాసుండు
ధర్మజునికెరింగించెననివినిసంతుష్టాంతరంగులై శౌనకాదిమునులటమీదటివృ
త్తాంతంబేమనిచెప్పెనెరింగింపుడనిన॥ క॥ సురసేవ్యధర్మచరితా। సరసీరుహ
పత్రనేత్రసన్నుతగాత్రా। నరకాసురకంసాంతక। వరమునిహృద్ధ్యానభరిత
వసుదేవసుతా॥ మాలిని॥ నిరుపమనిరవద్యానిత్యసత్యాత్మవిద్యా। సరసనుత
విధాతాసత్వసంగాతభూతా। సురమునిగణరమ్యాసుందరాకారగమ్యా। గు
రువిబుధకలాపాగోపికానందరూపా॥ ...

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వర ప్రసాదలబ్ధ కవితావి
లాసశాండిల్యగోత్రపవిత్ర కృష్ణయామాత్య పుత్ర విను
త గుణధైర్య మల్లనామాత్యప్రణీతంబైన శ్రీ రామస్తవరా
జంబను మహాప్రబంధంబునందు వ్యాసుండు సర్వ ప్రపంచకార
ణంబు మనంబగుటంజేసితన్మనస్త్యాగంబు కారణాచార్యానుగ్రహంబు
నంజేయవలయునని ధర్మజుతోడం జెప్పుటయు ధర్మజుండు గురుమా
యాసంసారవిరక్తులందెల్పుమని యడుగుటయు వ్యాసభట్టా
రకుండు మాయావర్ణాశ్రమాచారవిరక్తికత్తులసద్గురుం
జేరవలయునని చెప్పుటయు నన్నది ద్వితీయాశ్వాసము

# శ్రీ రామ స్తవ రాజము.

## తృతీయాశ్వాసము.

శ్రీరమ్యదివ్యశోభన।
కారుణ్యకటాక్షలబ్ధగంగాధరదే।
వారాశివిఖండనల।
త్స్మీరమణీప్రియవిహారశ్రీకృష్ణహరీ॥

వ॥ దేవాసూతుండుశౌనకాదిమహామునులకిట్లనియె నట్లువ్యాసుండుధర్మజుంగనుంగొనియిట్లనియె॥క॥ రాజేంద్రవిరక్తిమహా। రాజౌనధికారిమోక్షరాజ్యాపేక్షుడా। రాజశివయోగసిద్ధికి। గాజిగదిరుగంగవలయు రమ్యముతోడన్॥ సీ॥ అవనీశయీయుత్తమాధికారామువుక్షుఁడు నేతినేతివాక్యములశరీరబుద్ధీంద్రియప్రాణభూజలాగ్నిపవనాకాశశబ్దస్పర్శగంధరూప। రసమాదిసంసృతిభ్రమలవిశ్వంబెల్ల జడముదృశ్యంబునశ్వరమునగుట। యిదియేమియనుగానుమెట్లకోనిన్నిఁటుగలసినయే యుకనేగానుకాను। మరియునెవ్వండనినయలమరిగిమరిగి। కాలెడిఁట్లోనివాఁడెట్లుబైలుదేరు। నట్టియాత్రియుతెంపునునిను మడింప। తన్నుదాగన్నగురుజేరదలచునపుడు॥సీ॥ జడివాఃబట్టినచాద్పునవాదించువట్టిచదువులపోహుగట్టిపెట్టి। యుదరపోషణ కొరకొడిగట్టినట్టి యూభయరూపములనెల్లపదడగలిపి। నానావిధన్యాయానటనలుతనచేటు గానియెుండోరులదిగానిదెరిగి। యేంలోకసుఖములుబైలుపచారములోను లోత్రారముఁగలోతెరిం?.। దేహవర్ణాశ్రమాచారదేశగాల। రూపరేఖాభిమానముల్ రోసివిడిచి। పిన్నపెద్దతనంబులుపిండిగలపి। యార్యశుశ్రూష శేయమోక్షార్హుఁడధిప॥ గీ॥ పెద్దలనఁగగొప్పపెనుకొండలంతేసి। వారుగారునట్టివారుగారు తన్నుదానెగన్నధన్యులెవారైన। వారెపెద్దలనగవసుమతీశ॥మఱియును॥ సీ॥ ఏజాతివాడైననేనీతివాడైననేజాడవాడైననెవ్వడైన। రాజయోగసమాధి రాజ్యాభిషిక్తుఁడైవెలిచూపుచూలోపుఏదుచూపు। లోచూడచూడంగలోకాస్తమయమునైపండువెన్నెలబయల్నిండివెలుగు। లీలోనమైయుంటలో తనువుసమర్చిమోదురుదన్నెరిగెడిమెరుకమరచి। హాయికిసినోర్చిచిత్సుఖోపాయుఁడగుచు మెవ

నిదో రాజ్యమైయున్న యెఱుక మంతు। డాత్మవిజ్ఞానసద్గురుం డార్యపూజ్యు। డా
దిదేవుండు నాతండె యనఘచరిత॥ సీ॥ గురుకులవాసంబు గోరి సముచితాసనం
బుననుండి కాయంబు నిక్కి। యారగంటి మాయారు గరవ్రాసి మతిసహసారము
న గురుబూజనమొనర్చి। దృష్టిజడాజడదృశ్యమధ్యమున నిల్పి కుండలిశక్తి మేల్కొలి
పియుంచి। పవనచిత్తంబులు ప్రవహింపగా జగజ్జాలంబు వెలిగింపబయలు పడిన।
పరమహంసట్టి యపరోక్షపదవి నొందు। వాఁడె ఖేచరిముద్రకీలాడినట్టి। రాజయో
గమనస్కోన్నసిజితార్థ। తుర్యధుర్యుండు కారణాచార్యవరుఁడు॥ క॥ యోగీం
ద్రమహిమలిట్లని। వాగీంద్రునికైన నల్లవాసవుకైనా। భోగీంద్రపతికినైనా। యీ
గడిదియనంగవశమె యీశునకైనన్॥ సీ॥ ప్రణవనాదస్వరూపము దీర్ఘఘంటికా
రవమున బ్రహ్మరంధ్రమున మ్రోయ। బ్రహ్మరంధ్రధ్యాన పరవశంబున ముక్తి
కాంత నెదురొక్కనికళలఁ దేల్చ। కళలంటి యాపరతిగరగి బిందువు జారసమరసా
నందాబ్ధిచంద్రుడగును। చంద్రకాంతపుకోటి శశికిరణంబులు జారకప్పురమందు
చలువ నొంది। సర్వశాంతివహించి నిశ్చింతుఁడగుచు। ధాత్రి నవధూతవేషావ
తారుడైన। సద్గురుస్వామి సేవించు సజ్జనుండు। పరమభాగవతారాధ్యపాలు
డధిప॥ గీ॥ కంటిదృష్టి చేత గను విశ్వమెల్లను। దర్పణంబు గల్గ దన్ను గనును। ఆత్మత
త్త్వమార్గమారీతి గనవలె। నార్యదర్పణంబునందు భూప॥ చ॥ గురుకరుణాకటా
క్షమున కన్విదితుండగు భాగ్యశాలి శ్రీ। చరణసరోజరేణువులు సంకరవిఘ్నవిధా
తలాదిగా। శిరమున నావహించి నుతసేయుచు బ్రోచుచు కాంచి వెంబడిన్। దిరు
గగవాని కెందులను దెల్పన సాధ్యములున్న వేన్నృపా॥ గీ॥ ఇట్టిగురుని జేరకన్ని పోక
లు బోవ। చిత్తశుద్ధిలేదు చింత పోదు। మాయమాయలాడి మటుమాయమంత్రా
ల। దొలగిపోదు నాత్మ దెలియనీదు॥ సీ॥ కనునంత మేల్కొక గడ్డము ల్పెంచిన బూ
చిబూచని మాయబోనె వెరచి। గురుసేవ సేయక గొట్టడై తిరిగిన చీరలేదని మా
య సిగ్గుపడునె। తన్నుదా దెలియక తలక్రిందుగా బడ్డవిద్యవాడని మాయ చోద్య
పడునె। యానందమొందక నాలుబిడ్డల వీడ దోసరారని మాయ శోషిపోనె। యం
తతా గాక దేహంబు నాగ్రహింప। శూన్యగాడని యీ మాయ శైత్యపడునె। తె
లివి నొందక నూరూర నలమటింప। దేశగీడని మాయ దా దిరుగబడునె॥ క॥ ఎన్ని
విధంబులనైనను। నున్నదియున్నట్టికన్న యోగుల సేవన్। తన్నే తా నెరుగక పో।
దన్నా మాయా ప్రపంచమరితయు చాసై॥ క॥ ఈరీతి తన్ను దా గను। కారణగు
రు మూర్తి జేరి ఘనవినయ విధే। యారూఢి శిశ్రూషలు। నారయ సలుపంగవల
యు నెవి యెట్లన్నన్॥ గీ॥ పరమగురు జేరి ద్వాదశాబ్దములు లెస్స। నాత్మయును

సంగమును సానమనగ మరియు। పరగ సద్భావమునుననబడినయట్టి। నాల్గువిధ ములశుశ్రూషనదుపవలయు॥సీ॥ నాల్గుశుశ్రూషలనడకలు వేర్వేరవిభజింతువి నవయ్యావిమలచరిత। యార్యాభిమతపదార్థానుకూలముసేయునది యాత్మశు శ్రూషలనదుపవలయు। ఆపాదమ స్తకాభ్యంజనాతిథ్యములననంగ శుశ్రూష లనగనొప్పు। శ్రేష్ఠ తగృహారామసీమలనరయుటల్ స్థానమగ్ శ్రుశ్రూషలాడలా దెను। తాతదైవంబుతల్లియుతండ్రికర్త। యేదుగడయనుగురుడంచునెంచిభక్తి చేయుసద్భావశుశ్రూషసిద్ధమిట్టు। లెరిగినదుపంగవలయునుగురుసిఁజేరి॥క॥ ఇ టువలెసేవలుసేసే। భటునకుబోధింప వలయుపరమగురుండా। కుటిలప్రపం చభావన। నటులన్నియు దలియశాస్త్ర సమ్మతిననఘా ॥సీ॥ ఎరిగిరొందరు గనియి బ్బంది తెల్విక్కె మెదురెనుంగకయున్నయెరుకకైట। నిలుచున్నవాయునుపోలికా రోపింపఁబడుకల్పితుండహంభావమునను। జివ్హక్తితోసదాశివుడన బడుకల్పి తాజ్ఞానభావమాయాస్వరూపు। మఱియు నాప్రకృతియాచరణవిక్షేపమాత్ర శక్తులవ్యామోహజాడజూడ। తనకిందభావమనిపించుకొనును మొదట। యావర ణ శక్తిదేహంబుప్రకృతి। భావమునపరాశక్తితో పరమహేతు। డనగ బెంపె సుర్కకల్పితుండవనినాథ॥

## ——※( మాయావిచారఘట్టము. )※——

క॥ పరమేశునియువయువమే। బారిపోరివిక్షేపశక్తిమూడహముల కగ్। మ రియాకారంబైదా। బెరిగెమహత్తత్త్వమనగ పృథ్వీరమణా॥గీ॥ అందహంకార ములమూటియందునథమ। మైనభూతయహంకృతియందువిశ్వ। కారణాఖ్యా తమోగుణకల్మివాది। శక్తితోజ్ఞానవికృతిధూర్జటియనంగ॥గీ॥ మరిజగత్సూక్ష్మ దేహమైమధ్యమోహ। మనెడితైజసాహమునువర్తనవికృతిర। జోగుణంబుని చ్ఛాశక్తితోగుణించు। నతడెహైరణ్యగర్భుండటంద్రుబుధులు ॥గీ॥ మోహవి కృతిసత్తమోహకాపైరికా। యహముపిశ్వదేహయరయసాత్త్వి। కంబుజ్ఞాన శక్తిగలసివిరాట్పురు। షుండెవిష్ణుడనస్థిరాత్మ ॥సీ॥ కల్పితపురుషుండుకడు రుద్రతత్త్వంబుపలనబీజభూతములకుబీజ। మారజోగుణమున హైరణ్యగర్భుం డుకర్మేంద్రియములకుకంగిసాత్త్వి। కుండావిరాట్పురుషుడునావిష్ణువు జ్ఞానేం ద్రియములబీజంబు రాజ।సగుణసత్త్వైక్యతసరగనంతఃకరణములకుబీజంబుసమ తనతడె। యఖిలదేహేంద్రియసమష్టియందునుండి। జీవరూపంబులైప్రవేశిం చితానె। మరిక్రియాశక్తియాక్రుడైమరచితన్ను। బుద్ధికల్పనభ్రాంతిచేపురుషుఁ డమెర్యె॥ క॥ నానాదేహేంద్రియాదుల। నానాత్వభ్రాంతినొంది నాదీదనుచున్।

నానాభిమానములచే। నానారూపంబులాయెనారాయణుడే॥ మ॥ కలలో జీ
వుడు బుద్ధికల్పనలచీకాకై చుఁగస్పించుపో। కలచిద్రూపుడు దానె సిగ్గులనిరాకా
రుండునై యుండియుఁ। కలిమిన్ లేమిని జెందుచున్ వివిధసంకల్పాకృతిన్ బంధ
ము। తుల నానావిధజంతుజాలములునై తోచున్ జగత్కార్యమై॥ చ॥ కనకంబా
కటకనేకభూషణములై గాన్పించుమార్గంబునన్। ధ్వని దా నొకటి వాద్యభే
దముల భేదంబైన చందంబునన్। మనసాకారవిచిత్రదృశ్యత బ్రహ్మభాస తేజం
బు తా। గనుపట్టుం సకలంబునా చునిజమోక్షశ్రీవివాహోత్సవా॥ క॥ మరి బ్రహ్మ
ము వ్యతిరిక్తము। పరికింపగ లేదు నీదు భావములోనన్। పెరుకెంచఁబోకు సర్వము।
పరమాత్ముండనుచు జూడు పాండవముఖ్యా॥ క॥ కౌంతేయాగ్రజధీవిభ్రాంతికి
సర్వంబు జూడ బ్రహ్మమయంబై। సంతోషమిచ్చు మాధుని। కెంతయు సుఖమిదు
దుఃఖమిచ్చిన భంగిన్॥ క॥ స్త్రీలంచు పురుషులంచును। జాలాభేదంబు లెందు జనునె
వడైనా। బాలుండు వాడె యాచం। డాలాంతము బ్రహ్మ మంతటను సరిభూపా॥
క॥ బాలవయోవృద్ధస్త్రీజాలంబుల నెవ్వడైన సద్గురు కృపచే। వాలాయము తమ్మె
రుగక। నాలోకింపంగదలచు నతడు తమ్ముడౌ॥ క॥ తనుమాత్ర మెరుగకొరకై।
తన పాత్రాపాత్ర మెవడు దలపోయునొకో। తన కట్ల నెవడు పాత్రుడౌ। తను దా
రక్షించుకన్న ధర్మము గలదే॥ క॥ నిండుక పరమాత్ముండిటు। లుండంగా నెఱుగ
లేక యోగులమనుచున్। యుండలవానలమంచుల। నుండగ మోక్షంబెటేనకును దుర్వ
రమహా॥ సీ॥ మానులై కొందరు మాటలాడనివారు కొందరు మంత్రముల్ గొణుగు
వారు। కొందరు తీర్థయాత్రాందోళులగువారు కొందరాకలము చేగుందువారు।
కొందరే ప్రొద్దులోకులకేడ్చువారును చలికి వానకు కొందర ళుకువారు। తపసులై
కొందరు తలక్రిందులగువారు ముక్కులుకొందరు మూయువారు। నిన్ని తెలుగుల
నెందఱు నెన్నిపాట్లు। బద్ధసంసారమే గాని బ్రహ్మబోధమార్గమది గాదు సర్వం
బు మరచితన్ను। సద్గురుత్వంబు గాగన్న జ్ఞానయోగి॥ క॥ నానావిధదృశ్యంబులు
నానాయని నేతివాక్యనటనలచేతన్। నానివొలంగగ ద్రోచిన। తానుండా నాను
లేని తానే నిలుచున్॥ గీ॥ వాసనాక్షయమానసవశము లేక। తత్వబోధంబు తెలి
యంగ తలపు లేదు। అందు వాసనాత్రయముల నడచి పుచ్చి। పొందవలెచిత్తజయ
మున బోధరూప॥ వ॥ అందు వాసనాత్రయమనో నాశలక్షణంబెట్లంటేని॥ క॥ లౌ
కిక మెరిగిన డపని। పోకలుగా రాదటంచు బుధసభలందున్। లోకానుసారిగా జను।
నా కుమతియె లోకవాసనాఖ్యుడు దెలియన్॥ గీ॥ చదివి చదివి వాటిపదముల యు
ర్థంబు। వెదకి వెదకి కర్మ వివశుడగుచు। వెట్టి వెట్టినష్ట నెతనొందు టేజూడ। శా

ప్రవాసనంద్రుసర్వవిదులు॥ గీ॥ కాయపోషణంబుగంగానదీస్నాన। మాదిగా
గగల్గునఖిలశౌచ। మునులు దేహవాసనలుమూఢుడగువాడు। తగిలినడుచుచుం
డుధర్మచరిత॥చ॥ కావునవాసనాత్రయముకష్టపుకర్మమునిందులోపల। ప్రాపు
డుచెందులోలదము జెప్పగరోతలుయెంతమాత్రమే। వాఏదియెంచగానరకపా
సచమీపటహీనజన్మమి । ట్టివిపరీతముల్విడువనెవ్వడెరుంగునతండెధీరుడౌ॥
ఉ॥ లోకముతోడి జేలసభలోచదువుల్లదువంగగోరునా। పోకలుబోవనేలమల
మూత్రపుకొంపనుదానునాత్మగా। జేకొనిసల్పుతీర్థములుశిలములేలనటంచువా
సనల్। గయికొనకుండువాగలధికారులుమోక్షమునొందుగానృపా॥ క॥ మన
సేసర్వజగంబులు। మననవ్యతిరిక్తమైనమాయలుగలదే।మనసేసజ్జనసంగతి।గ
నగామానసజయంబుగల్గునృపాలా॥అంత॥ గీ॥ తన్నునెరుగగోరుతలపునుబు
ట్టును।దృశ్యమార్గమెల్ల తెలియబడును। నప్పుడాత్మతత్వమతిశయంబుగగల్గు।
పాండవాబ్ధిచంద్రపార్థివేంద్ర। సీ॥ రాజేంద్రవినుమనఃప్రాణంబులాత్మగాదిన్ని
టినెరిగెడి యెరుకయాత్మ। తాపత్రయంబులుతలపులునాత్మగా విన్నిటినెరిగెడి
యెరుకయాత్మ। పుత్రమిత్రకళత్రభూమ్యాదులాత్మగాదిన్నిటినెరిగెడియెరుక
యాత్మ। యష్టాంగయోగాదినిష్ఠలునాత్మగాదిన్నిటినెరిగెడియెరుకయాత్మ।య
ట్టియాత్మనీవుయఖిలంబులునునీవు। నీవునేనటన్నభావమీవు। గానవేరులేదుకైవ
ల్యపదమార్గ। మేనటంచుదలచునెరుకవీవు॥క॥వినుమివ్విధమునజెప్పిన।మునివరు
నకుధర్మజుండుమోదముతోడన్। వినయభయభక్తిపరుడై।వినుపింపుండింకనే
మివినగావలెనో॥ గీ॥ అనుచుధర్మజుండునాపరాశరసూను । తోడబలుకునవ్వు
డుతొలుతదేహ।తత్వమార్గమెల్లతగజెప్పకోరకునై। వినుమటంచుబల్కె వే
ట్కతోడ॥ క॥ జీవేశ్వరతనువులునా।ల్గావిధమెరుగంగనీకునఖిలముదెలియున్।

(జీవేశ్వరతనుచతుష్టయముఘట్టము.)

భావింపబ్రహ్మబోధము।నీవైయుండంగవచ్చునిర్మలచరితా॥ వ॥మరియుజీవేశ్వ
రతనుచతుష్టయలక్షణంబెట్లంటేని॥ సీ॥ త్వగ్దృష్టికర్ణజిహ్వాఘ్రాణములునైదు
శబ్దాదులైదువచనములైదు। పాదపాయూపస్థపాణివాక్కులునైదుజాత్రా
దిబంధులజాడలైదు। క్ష్మాజలాగ్నిపవనాకాశమహాభూతపంచీకృతకదంబపం
చవింశ।త్రిప్రకారస్థూలదేహమిందుకవస్థజాగత్తునేత్రముల్ స్థానమరయు। యు
క్తభోగంబుమరిక్రియాశక్తిరాజ। సగుణములువిశ్వడభిమానితెగనకార। మర
యమాత్రకయాత్మజీవాత్మయతడె। వ్యావహారికజీవుండుభావరేణ్య॥క॥స్థూ
లంబిపదిసంజ్ఞల। జాలముగద్వావసనావశతసూక్ష్మాంగం।బిలోనెనిమిదిపురమా

ల। చేలలితంబగుప్రియో క్తిజెప్పెదవినుమీ॥ గీ॥ జ్ఞానకర్మేంద్రియంబులుమానసా
ది।కరణములునాల్గుతమమునుకర్మకామ।ములునుభూతంబులును ప్రాణములు
నుగూడి। యష్టపురములలింపుగాంగమగున్నపాల॥సీ॥ కలలవస్థలనునికిఁకంతమి
చ్ఛాశక్తితైజసుండధిమానితనరసాత్వికంబుకామముమాత్రుకయును స్వేచ్ఛా
భోగమందులవ్యాపకమయినయాత్మ।యంతరాత్మవునతండలప్రాతిభాసికయా
త్ముడీపదిసంజ్ఞలందులింగ। కాయమీస్థూలసూక్ష్మద్వయాంగంబుల కారణంబ
గుటచేకారణాంగ।మగునునిదురందుసర్వేంద్రియంబులడగి। యూర్పుగలిగినభం
బుండనేర్పడంగ। నన్నవచనంబునగుటనీరగ్నిగలదె। యిందులకుపాత్రమైధా
త్రియొసగునయ్య॥ గీ॥ పంచవింశతితత్వంబునెంచనిట్లు। లగునువటబీజగతికార
ణాంగమింద।వస్థసుప్తియుహృదయంబువాసమగును। ప్రాజ్ఞుడభిమానియిందు
తుద్రవ్యశక్తి॥ క॥ కననానందముభోగము।ఘనతామసగుణముమాతృకమకా
రంబా। వినువ్యాపకాత్మపరమా।త్మనతడేపారమార్థికాత్ముండధిపా॥

క ॥ కారణమీపదిసంజ్ఞల । మీఱునవస్థాత్రయముల మించినవత్తై।
కారణతనువునకుమహా। కారణమనుదేహమింకగలదునరేంద్రా॥

వ ॥ యిట్లవస్థాత్రయంబునకు సాక్షియై కారణంబునకు మహాకార
ణంబు శరీరమెట్లన్న పంచభూతోత్పత్తి హేతువులగు సద్యోజాత వామదే
వాఘోరతత్పురుషేశానులను పంచబ్రహ్మశరీరంబులకు పంచభూతంబులుని
వృత్తిప్రతిష్ఠావిద్యాశాంతిశాంత్యతీతపంచకళలుపంచవిషయంబులుపరాశక్త్యా
దిశక్తిజ్ఞానశక్తిక్రియాశక్తీచ్ఛాశక్తులుప్రేరకస్వరూపంబులైనపంచప్రాణంబు
లుపంచాతురియై పంచేంద్రియంబులుబ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులను నీపం
చకతత్వాలంతఃకరణంబు లిట్లిరువదియైదుతత్వంబులంగూడి మహాకారణశరీరం
బగునిందుకవస్థతుర్యంబభిమాని ప్రత్యగాత్మజ్ఞానశక్తిశుద్ధసత్వగుణంబు మూ
ర్ధిస్థానంబునాదంగభోగంబు ఓంకారంబుమాతృకవీనియందువ్యాపకంబగు
నాత్మనిర్మలాత్మయతండె కూటస్థచైతన్యుండిందునోంకారం బుండుటనదియె
మూలప్రకృతియీపదిసంజ్ఞలుగలది మహాకారణంబను దేహమీనువదిసంఖ్యా
సంజ్ఞలమీదిజ్ఞప్తికళామాత్రంబుగా విశేషించినదియెతుర్యాతీతంబిట్లు జీవత
నుచతుష్టయంబికనీశ్వరతను చతుష్టయలక్షణం బెట్లన్నపృథివ్యాపస్తేజోవా
య్వాకాశ చంద్రసూర్యాత్మలను అష్టమూర్తులీశ్వరునియొక్క విరాడ్రూ
పంబగు స్థూలంబిందులకుత్పత్తియవస్థ యభిమాని బ్రహ్మక్రియాశక్తి రాజసా
హంకారంబుసూర్యస్థానంబుసర్వకర్తృత్వభోగంబకారంబు మాతృకవీనిలో

డుఁగూడి సకలంబగు నాత్మ భూతాత్మయీతో విశ్వాదిసంజ్ఞలంగల విరాట్పురుష
డింక సకలభూతంబుల కాశ్రయంబగు హిరణ్యగర్భశరీరంబెట్లన్న దశదిక్కులను
శ్రోత్రంబులు, వాయువుత్వగింద్రియంబు, సూర్యుండు నేత్రంబులు, వరుణుండు జి
హ్వేంద్రియంబు, అశ్విని దేవతలు ఘ్రాణేంద్రియంబు, వహ్నివాక్కు, ఇంద్రుండు క
రంబులు ఉపేంద్రుండు పాదంబులు, బ్రహ్మోపస్థంబు-మృత్యువు గుదంబు- జ్ఞాతృవం
తఃకరణంబు, మనంబు చంద్రుండు బుద్ధి బ్రహ్మ, క్షేత్రజ్ఞుండు చిత్తంబహంకారంబు
రుద్రుండు, నీచతుర్దశ దేవతలతోడఁగూడినది హిరణ్యగర్భశరీరంబిందులకవస్థితి
విష్ణువభిమాని యిచ్ఛాశక్తి సాత్త్వికహంకారంబు చంద్రస్థానంబు సర్వపాలకత్వ
భోగంబు కారంబు మాతృక వీనితో వ్యాపకమైనయాత్మ సూత్రాత్మయీతోమ్మి
దిసంజ్ఞలంగలది హిరణ్యగర్భశరీరంబగు, నీవిరాడ్ఢిరణ్యగర్భులకు గారణమై
నదియై యుండు దస్వరూపంబైన యవ్యాకృత శరీరంబు దీనికి ప్రళయావస్థ రుద్రుండభి
మాని ద్రవ్యశక్తి తామసాహంకారంబును నగ్నిస్థానం సర్వసంహారభోగంబును
మాతృక మకారంబును వీనితోడం గూడి వ్యాపకంబగు నాత్మ శుద్ధాత్మ మరియును
వ్యాకృతంబన మదహంకారంబనటవది మేద్రిగుణగర్భంబును బిందుపాధి చేది
ద్విలాసంబై పంచభూతంబులకుం గారణంబగు మరివిరాడ్ఢిరణ్యగర్భయవ్యాకృ
తులను నీశ్వర మాయోపాధిశరీరంబులకు సాక్షిరూపంబగునది యమూలప్ర
కృతియదిస్వరాట్టనంబగునదియ యనాహతనామంబును వదియె పంచబ్రహ్మం
బును నదియ పంచభూతంబును యట్టి మూలప్రకృతిశరీరంబునకవస్థ సర్వసాక్షి
యీశ్వరుండభిమాని శుద్ధసాత్త్వికాహంకారంబు జ్ఞానశక్తి బ్రహ్మాండాంతస్థా
నంబు సర్వకర్తృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వ సర్వనియంతృత్వసర్వ
భోక్తృత్వాశ్వర్యైశ్వర్యాదిషణ్ణుణైశ్వర్యంబై భోగభోంకారంబు మాతృకయం
దులవ్యాపకంబగునాత్మ మహాత్మయీతోమ్మిదిసంజ్ఞలంగలది మూలప్రకృతిశ
రీరంబగు నీపిండాండబ్రహ్మాండంబులగు యష్టశరీరంబులు వాచ్యార్థంబనుపించు
కొనునీశ్వరరూపంబిదిదృశ్యంబు వీటికి సాక్షిస్వరూపంబగు చిత్తు యీయెనిమి
దింటిగూడిన జ్ఞానోపాధిచేత శబ్దబ్రహ్మంబనిపించుకొనుచు వీటికినతీతంబగున
దియు యీశ్వరునితుర్యాతీతంబట్టి జలశర్కరన్యాయంబున నిత్యముక్తశుద్ధబు
ద్ధస్వభావసత్యప్రజ్ఞానఘనసచ్చిదానందనిత్యపరిపూర్ణంబగునదియే నిష్కళబ్ర
హ్మంబదియే నీవని యసిపదంబు చెప్పునది తత్త్వమస్యాదిమహావాక్యలక్షణంబు త
త్పదత్వంపదలక్ష్యార్థంబు నసిపదంబఖండంబుగా బోధించునట్లగుటం జేసి తత్పద
వాచ్యార్థంబగు జీవేశ్వరాద్యష్టశరీరంబులు దృశ్యంబనెఱిగి పరబ్రహ్మస్వరూ

పంబవై సుఖంబుందుమనిమరియునిట్లనియె॥గీ॥అఖిలవ్యవహారుఁడతఁడె జీవాత్ముఁడం
త।రాత్మ సంసారమునననంటియుంటకుండ। యిలనుజీవాత్మపర [illegible] యు
త్మ।వ్యావహారికిసాక్షియైనతఁడె భూప॥క॥ నదియుండు నోడఁ నడచిన। ...
లనున్నదరులునడుచుఁ దమట్లన్। కదలినచంద్రుఁడు కదలును। కదలిన జలమందుఁ న
డుసు కదలినరీతిన్॥క॥ దేహంబుచావుపుట్టువు। దేహికిననునట్లు నాత్మనిత్యంబై
నన్। దేహాద్యవస్థగలిగెను। దేహియునను గాపురంబు దెలియుక నధిప॥

క॥శ్రీరాముని మనుజత్వము। దూరంబున దొలఁగద్రోచి దొంయుగనీవే।
నారాయణుడనుకైవడి । నారయకూటస్థమాత్మయందైక్యమగున్॥క॥ న
దిదాటి పదుగురేగుచు। తుదితను లెక్కింపమరచితొమ్మండ్రంకన్। పదిగురులే
రనినీవే। పదియావాడట్లుజీవపరమైక్యంబుల్॥ మ॥ జననాథావిపరీతసంశయ
ములజ్ఞానంబువిఘ్నాంతయుం। బనగాముక్తికివాటినిందొలగిబ్రహ్మానందవారాశి
లో। మనసుల్దీరగనోలలాడునిదివేమర్మంబుసత్యంబుగా।వినుమీనీకికజీవసం
సృతులుసోకన్ రావుయూహింపుమా॥ క॥ వినవోయిధర్మనందన। తనుదాగ
నుగొనుటకంటెధర్మములేదై। నను వైరాగ్యంబుపరతి। యునువలెలేకున్ననా
త్మయోగముగలదే॥క॥ యిన్నిలజెప్పవలయును। తన్నెతానెరుగుకొనకుతన
కన్యంబై। గన్నదియంతాదబ్బర। నిన్నేనీవెరుగనీవానికగంబధిపా॥క॥ ఈరీతి
నెదురుగాజూ। పారెడిపిండాండమాదిబ్రహ్మాండంబుల్। నీరుగజేసినవాడే। వై
రాగ్యోపరతులందువాడున్నృపాలా॥ క॥ పలుమాటలపనియేమిక। గలవంటిది
మాయదీనికలలోనైనా। గంవనజూడగబోకుము।కలిమియులేమియును లేనిగా
న్పనభూపా॥ క॥ సకలప్రపంచంబునువా। చికమని దెలిసిననటువంటచిన్మా
త్రజ్ఞ। ప్రకళామాత్రంజేనను। చుకంవికములేనియోగిసుఖభోగ్యుడగున్॥ సీ॥
సంసారియగువానిజన్మంబుభీవ్వథా సంసారియగువానిజాడరోత।సంసారియ
గువానిసంగంబుకోరగామిసంసారియగువానిసాటిలూటి। సంసారియగువాని
సంపదలాపద సంసారియగువానిజదువుజాలి। సంసారియగువాని సౌఖ్యంబు
దుఃఖంబు సంసారియగువానిజాతినడత। పాపసంసారియగువానిబ్రతుకులతు
కు। దైన్యసంసారియగువానితవ్వులుతెవ్వులు। కర్మసంసారియగువానికాంక్షవల
ధి। రోషసంసారియగువానిబుజువువెతలు॥సీ॥ సంసృతికడుదుఃఖసంతాపహే
తువుసంసృతియతిక్రూరసాహసంబు। సంసృతిదుర్దోషసంగమలాభంబు సం
సృతిదుష్కర్మసంగరంబు। సంసృతియాశాపిశాచవికారంబుసంసృతిదారిద్ర
సంకటంబు। సంసృతిదేహాస్థజగ్ధరీఘూతంబుసంసృతిపాషండసన్మతంబు।సం

సృతియశోకమూలంబుచంచలంబు। సంసృతియ నారకంబునఃజాలిజాలి। సం
సృతియాధర్మఘాతియౌజన్మహాని। సంసృతియౌసర్వవేధలునులకెల్లి॥ సీ॥ తనువె
త్తుటకుజాలదాతసబవిశారనెరిగియునిగ్గేలనెరుగడకట। పుట్టినపుట్టువిపొందిన
నెలవేదియున్నతావెక్కడవెడలుటేది। యింతయునుజూడంగహేయకరంబును
ముట్టంటుకోతలమూలమిట్టి। లుచ్చరింపగరానిముచ్చుబ్రతుకులకై నిక్కమె
తానుమానిసీనటంచు। నయ్యయోనింటనుండగానర్హమగునె। శుక్లశోణితమిశ్ర
మాస్థూలదేహ। కారణంబైనలింగాంగఘాతియగుచు। చిత్తబయమునతన్ను
దాజేరనలదె॥క॥ వేయేలవొక్కమాటను। మాయాసంసారమెల్లమదియించు
టకై। యాయముజెప్పెదమనసే। కావేంద్రివిషయకార్యకారణమనఘ॥ క॥
మనసేమాయాజగములు। మనసేసంసారదోషమార్గముసర్వం। బునుమనసే
కానిమరే। మినిలేదనుచునెరింగిమెలగున్నపాలా॥ సీ॥ మనసయాసంసారమా
యావికారముల్మనసయాలౌకికమహిమలన్ని। మనసయాపాపంబుమనసయా
పుణ్యంబుమనసయాలోకాదిమత్సరములు। మనసయాజీవులుమనసయాజన
ములుమనసయాసుఖదుఃఖమలినములును। మనసయాస్త్రీలునుమనసయాపురు
షులుమనసయాయఖిలాశ్రమంబులెల్ల। మనసుగాకున్నదొకటైన మాయలే
దు। మాయగాకున్నదొకటైనమనసులేదు।యఖిలజగముమనోమాయలగుట
దెలసి। బ్రదుకనేర్చినవారలుబ్రహ్మవిదులు॥క॥ వృధలుసుమీసంసారము।వృధ
లుసుమీపుణ్యపాపవితతిజగంబుల్। కథలుసుమీపురుషార్థము। బుధులుసుమీవీటి
నెరుగుపుణ్యులుధరణిన్॥క॥ అపరిమితానందంబుల। నుపశాంతినిబొందకున్న
యోగులువిబుధుల్। విపరీతసంశయంబుల। చపలంబగుధర్మతనయసజ్జనవిన
యా॥క॥ రానీకుచిత్తవృత్తులు। పోనీకుసమాధియందుబుద్ధిదలిర్పం।గానీకుయో
గవిఘ్నము।లేనీకువిచారమేమితెలివందినృపా॥ఉ॥ శ్రీగురుపాదపద్మములుచిత్త
మునందలపోసివిశ్వము। నేగమెకాల్చివేసితెలివేపరమాత్మపదంబటంచుపై।
పైగురిమేరలేనిసుఖమందుసమాధినిపోలలాడునా। యోగియజీవముక్తుడును
తోన్నతుడెందునుధర్మనందనా॥చ॥ గురుకృపగల్గిబోధమొనగూడిపరాపరవ
స్తువైనయా। మెరుకబయల్దలంచిమదినేకముసేయుచుసంశయంబులన్। దొర
గిపజీవముక్తులకుదుర్జనసంసృతిదోషమెన్నడున్। బొరయదుచిత్తవిభ్రమము
పుట్టదుసుమ్మినృపాలచంద్రమా॥చ॥ చదువులుపెక్కుగాజదివిశాస్త్రవివేకము
నేర్చిధర్మము। లొప్పదలగుయోగవిద్యలనఃబోధలనెన్నిటివిట్టువీగినన్। మృదువగు
రాజయోగమునిమేషణమాత్రముబొందకుండిన। న్నదలగుచిత్తసంశయము

వాసనయుఁ జెడదయ్యాధర్మజా॥ గీ॥ సాంఖ్యతారకయోగసంజ్ఞల నెఱింగి। రాజ
శివయోగసంయోగ రామరాజ । ఖేచరీయుక్తసౌఖ్యలక్ష్మీరతుండు। వాఁడె వే
దాంత వేదనిర్వాహకుండు॥ సీ॥ ఉత్తరశాంభవీయుక్తుండు ముక్తుండు పరమవి
ద్యాధురంధరుఁడు గురుఁడు। తుర్యసుఖాస్వాదధుర్యుండు నార్యుండు బ్రహ్మానుకూ
లసంభ్రముఁడు సముఁడు। వాదాంతవిద్యావినోదుండు మోదుండు పురుషార్థనట
నసంభోగియోగి। కూలంకషజ్ఞానగూఢుఁ డారూఢుండు దృగ్దృశ్యరాగవర్జితుఁడు
మితుఁడు। వేదవేదాంతసిద్ధాంతవేద్యుఁ డాద్యుఁ। డాత్మసుస్థిరచిత్సుఖోత్సాహదే
హి। నిర్వికల్పసమాధినిర్ణీతదాత। కారణాచార్యసేవాధికారిసూరి॥ సీ॥ మన
సుదీరినవాఁడు మనసుదీరనివాఁడు గన్నవాఁడున్న బైఁ గన్నవాఁడు। గలగకుండినవా
ఁడు గలగకుండనివాఁడు లేనివాఁడును గల్గి లేనివాఁడు। బైలుదేరినవాఁడు బైలుదేరని
వాఁడు మెఱుఁగువాఁ డెఱుఁగుద న్నెఱుఁగువాఁడు। కన్నులొకఁగనువాఁడు కన్నులొకఁగలవా
ఁడు గానివాఁ డంతయే గానివాఁడు। ధీమనశ్చిత్తహంకారదృశ్యదృశ్వ। సకలతత్త్వార్థ
లక్షితవిద్యవాఁడు॥ సీ॥ ఆకాశపంచకాభ్యాసుఁ డంతర్లక్ష్యభోగయోగ్యుం డైన
యోగివరుఁడు। ఆకాశపంచకాభ్యాసుఁ డ తర్లక్ష్య భోగయోగ్యుం డైనయోగివ
రుఁడు। ఆకాశపంచకాభ్యాసుఁ డంతర్లక్ష్యభోగయోగ్యుం డైనయోగివరుఁడు। ఆ
కాశపంచకాభ్యాసుఁ డంతర్లక్ష్యభోగయోగ్యుం డైనయోగివరుఁడు। యతఁడె యా
కాశపంచాంగమైనవాఁడు। నతఁడె యాకాశవాణియునైనవాఁడు। నతఁడె యాకా
శరూపియునైనవాఁడు। నతఁడె యాకాశవాసియునైనవాఁడు॥ గీ॥ ఒక్కయుక్తి
లోననున్నది తత్త్వంబు। పట్టిచదువు పేరుపెట్టి గాదు। నేను నేనటంచు నెఱసిన తెలి
యదా। తాను గాక వేరె తాను గలఁడె॥ గీ॥ అధిపయిదిమర్మమం గదరాగ్రమధ్య।
వార్ధినదుమకృష్ణాశ్రయద్వారవతిని। యాత్ముఁడున్నాఁడు సూత్మదృగ్వ్యాప్తి
చేత। జ్ఞాతగలవాఁడ లేకనుసంజ్ఞ గాను॥ గీ॥ కన్ను జెదరంగ దృష్టియు గాలి జెద
రు। దృష్టి గాలియు జెదర బుద్ధియును జెదరు। బుద్ధి జెదర నంతర్లక్ష్యముద్ర జెదరు।
ముద్ర జెదరినబోధయు మును పె జెదరు॥ ఉ॥ కావునకంటిదృష్టి మది గాలి చలింప
కయుండునట్లుగా। భావనలక్ష్యముద్రలను పన్నడి నిల్పుచు బ్రహ్మబోధమై। భూవ
లయంబునందు మము బుద్ధిదలంపుచు సంచరింపుమా। యావిపరీతకల్పనలయుంద
వహానము గాన్నృపాలకా॥ సీ॥ స్వస్తికారోహణస్పర్శవేదాదితులీమాడుదీ
క్షల నెఱుఁగవినుము। మొదలసిద్ధాసనమునసుంచిధురిశిమ్యవాసటిప్రాతదుడిచి
భసితరేఖ। యాగమోక్తికదీర్చియాదలఁజెయి చేర్చి యంతట దెల్విసీవసుచు దెల్పి।
కడగినట్లు త్రివిధ దీక్షాప్రకారంబు కారణగురుమూర్తి కరుణసేయు। రాజ

యోగసమాధిసామ్రాజ్యసౌఖ్య। వార్ధిలోలాడుచుండెడువారలకును। నెన్న
టికిహానిలేనయామున్నెరి। సన్నుతులువిన్నజాలదెజన్మఫలము॥ ఉ॥ ఈగతి
దెల్పవమానికిపరేంద్రుడుబల్కె-మహాత్మ తారకా। యోగముఁబట్టి రాజశివయో
గసమాధులుసేయువేళను। ట్లాగురుభక్తుడేమిగనునట్టదియెంతయుజెప్పుమన్న
వే। దాగమశాస్త్రసన్మతిరహస్యముఁదెటగవ్యాసుడిట్లనుఁ॥ సీ॥ సిద్ధాసనస్థు
డై శ్రద్ధాసమృద్ధితోముకుళచాయకొంకెంతనిష్పదోప। కన్నులుదేలించిగదియం
గగీలించికనుచూపుమేరకన్గంటిసూటి। పట్టువిడుపులులేని బైలెల్లకబళించియం
దులోకమూటుగాఁగాంచుచ్రోసి। సిల్పుచూపరితెల్వినిండిపారగబయల్పండార
బోసినట్లుండునపుడు। నెరుకపడ్డవాడునెరిగించుకొనువాడు। నెరుగువాడులే
కబెరుగుగాక। బ్రతుకుబయలుబట్టిపరదేశిపక్షమై। మర్మివెల్గుచిత్సమాధినఘ॥
సీ॥ చిత్సమాధినిట్టుశివయోగిమదిలోనసాఖ్యసారజ్ఞప్తిసంభ్రమమున। వెలు
గుచునదివేదవేదాంతమావెల్గునుభవవేద్యంబునైనవెల్గు। వాచామగోచ్చరం
బై చెలంగెడువెల్గునెందెడైనకనరాకనుండువెల్గు। సత్తైనగురుకృపాజసంభవించిన
వెల్గుయిశరులానపడంగనీనివెల్గు। కంటినాగానుసన్నదిగానివెలుగు। కలదుతే
దనినదుమనగన్నవెలుగు। రాకపోకలుచెప్పంగరానివెలుగు। యనఘనీలోననెని
నునీవెకను వెలుంగు॥ శా॥ రూపవ్యాప్తములేనివెల్గుమదినూరున్వెల్గుయోగీంద్ర
సల్లాపంబైనవెలుంగుసద్గురుకృపాలాలిత్యమావెల్గుని। గ్లేసాంతఃకరణాకృ
తౌవెలుగుతెల్విఁబర్మినావెల్గులో। పలజూపట్టులుగల్గుయావెలుగునీలోవెల్గు
ధాత్రీశ్వరా॥ శా॥ లోలోనందనలోకమావెలుగుముల్లోకేశ్వరాతీతమా। బై
లాచార్యకృపా కటాక్షమునసంపాదింపనాతెల్వియా। త్మాలోకాత్మకబోధ
మానెరుకయార్యాస్తోత్రమాచిన్మయం। బేలీలంగనసౌఖ్యమాసుఖమునీవీక్షిం
పుణ్యాత్మజా॥ ... ... ... ... ※

## ※( గురూపదేశదండకము. )※

శ్రీరాజయోగప్రబోధప్రసన్నస్వయంజ్యోతిరానందపూర్ణ స్వరూపాను
సంధానుభోగావిశేషప్రవీణత్వసంప్రాప్తచిద్రూపధారేయుడైధీరుడైమించు
నాసద్గురుస్వామినింజేరియాత్మాంగసుస్థానసద్భక్తశుశ్రూషలఁమీరుశిష్యా
ధికారంబు వీక్షింపువాపేక్షతోనేతినేత్యాదివాక్యోపదేశాఖ్య దీక్షాప్రకారం
బులఁ దేహబుద్ధీంద్రియప్రాణసంసారధర్మంబుపేక్షఁ నలక్ష్యంబుగాఁజెప్పిత
త్త్వాక్షివంచుఁ ప్రమేయప్రమాణ ప్రమాతప్రమాసాక్షి కూటస్థబ్రహ్మైక్య
భావంబులఁ వేదవేదాంతమార్గంబులఁ దెల్పియాతత్త్వమస్యాది వాచ్యార్థ

ముల్ద్రోసిలక్ష్యార్థమా బ్రహ్మసాక్షాత్కరింపంగయా రాజయోగప్రకారం
బునన్ వానిసిద్ధాసనాసీనుగాఁ జేయుచున్ దాలలాటంబునన్ భూతిచే రేఖగాదీ
ర్చుచున్ మస్తకంబంటియీ జంగమస్థావరాదిప్రపంచంబు విశ్వంభరం గల్పియా
భూమినిన్ వారిగా జేసి యానీరమున్ వీతిహోత్రంబులో సింక నాయగ్నియున్
గాలినిం ద్రోవనా వాయువాకాశముం జేరగా శూన్యమార్గంబు హృద్వీధిలో
గూర్చుచున్ యామదిన్ బుద్ధియా బుద్ధినిన్ జిత్తమట్లా యహంకారమున్ జీవుడై
నందనందున్ మరిందన్నుఁ బైలో పరబ్రహ్మమం దైకమున్ జేస శ్రీచిన్మయానంద
వారాశినోల్లాసమంచున్ రహస్యామనస్కస్వరూపోపదేశంబు సేయన్ సహ
స్రారమందా గురుధ్యానముం జేసి పూర్వోక్తమార్గంబునన్ సచ్చిదగ్నిన్
బడన్ వ్రేల్చియాత్మైక్యముం గాంచియున్న ప్రపంచంబులున్నట్టులుండంగదాన
న్నదిన్ రూపనామాదికంబన్నదన్ లేక యామత్తకామత్కుణోపద్రవంబుల్గ
నన్ రాకనిర్వాతదీపంబు చందంబునన్ జెల్వితోనుండ బ్రహ్మానుకూలంబటం
చున్ మరిన్ దెల్పు శ్రీవ్యాసభట్టారకాచార్యవర్యుం బ్రశంసించుచున్ ధర్మపు
త్రుండు తా ద్రౌపదీయుక్తుడై వేదవేదాంతసిద్ధాంతశాస్త్రప్రకారంబు సాంగం
బుగా జేసీ సర్వంబు నంగోసి తత్పాదపద్మంబు హృద్వీధిలో డాసిపత్నీసమేతంబు
గా ధర్మరాజాత్మతత్త్వోపదేశంబు శ్రీవ్యాసమౌనిప్రసాదంబునన్ జేసిలోజూ
పు వేల్పూపులన్ గన్నగన్నంటిమేల్కాంచియే చూపులన్ జూడరాకున్న యా జూ
పులోనించి యా వెల్గుబోధాప్రకారంబు తానై ఫలింపంగ నిర్వ్యాజుడై భోజు
డై యోగనిద్రన్ మరింగొంత సేపంతలో లేచి శ్రీసద్గురు స్వామినిన్ జూచి సా
ష్టాంగ దండప్రణామంబులం జేసి యుత్సాహమైమిక్కుపంగంటి చిత్స్వాఖ్యమం
చున్ మరిన్ సన్నుతుల్ జేసి యోగీంద్రచంద్రా చిదానంద సాంద్రా మహాయో
గివర్యా సుఖజ్ఞప్తిధైర్యా నిజజ్ఞానచర్యా నమస్తే నమస్తే నమః॥ మ॥ శ్రీకల్యాణగు
రూపదేశ నిజలక్ష్మీ మోహనాకారము। ల్లోకానుగ్రహకారణోద్భవ సదాలో
కానువాగార బ్ర। హ్మకాశానుభవోజ్వలప్రకటతుర్యజ్ఞప్తి సౌకర్యజ్ఞ। వాక్ప
త్యాసదదోషహేయ గురురాయా వ్యాసభట్టారకా॥ మ॥ పరమజ్ఞానధురంధ
రుండవగునీ పాదాబ్జమే వ్యాసునం। స్మరణల్సేయుదు రట్టివారలుగదా సంసా
రవారాశివే। గిరమే దాటభయంబులన్నెడచి భక్తిజ్ఞానవైరాగ్యధా। గ్యరమా
రాగములందు చుండు గురురాయా వ్యాసభట్టారకా॥ సీ॥ ఒకమహా రత్నపు
లోనను చ్ఛ్వాసనిశ్వాసపతనుబంధించినపట్టభద్రా వేరొకగూఢమడియలో వీను
లవిందుగా ప్రణవనాదముగన్న భాగ్యశాలి। వేరొకగడియలో నోంకార

దృశ్యంబు గాల్చి వేసిన చిదాకాశరూప। పరికాలుఘడియలో మానస వృత్తు
లౌమకుపు తెల్వుల గల్పు దురితదూర। క్షణములో పలుబ్రహ్మసాక్షాత్కరింప।
రాగమొందగ నేర్చినయోగిచంద్ర। లేశమాత్రంబులో బ్రహ్మదేశమంత। యేల
నేర్చినసద్గురులీలలో॥క॥ క్షేత్రత్రయదీక్షాత్రయ। నేత్రత్రయలక్ష్యములను ని
న్నెరిగినవా। సత్రాణగను మునీశా। ద్వాత్రింశత్రయుతనుత్రితత్రయసూత్రా॥
క॥ సద్గురుడవైవని న్నే। సద్గతిగా నెవడు దలచి సంతసమందు। న్సద్గతికరుండువా
డే। చిద్గగనానందసీమ శ్రితజనసోమా॥క॥ మునిచంద్ర నీప్రసాదం। బునవానం
దాధిపత్యమునకర్హుడనై। తినినీప్రభావమేమని। కొనియాడంగలుగునాడ కో
రుకులగాదే॥ గీ॥ తనయుడైనవాడు తలిదండ్రి ముందర। విద్దె మాడనదియు ము
ద్దుగాదె। యట్లనన్ను మీరుహర్షించి సతతంబు। ప్రీతిపోషణంబు సేతురయ్య॥గీ॥
తల్లితండ్రిగురుడు దాతయు దైవంబు। యిహపరంబు నీవె యేడుగడయు। గాగ
నామనంబు కల్యాణయుక్తమై। యొప్పుచున్నదయ్య యోగివర్య॥ గీ॥ జయముస
ద్గురురాయ సజ్జనవిధేయ। జయము శ్రీసర్వయోగీంద్రహృజ్జలధిచంద్ర। జయ
ము ద్వైపాయనాఖ్యవిశ్రాంతిసౌఖ్య। జయము శ్రీవ్యాసశుద్ధవాసనరమేశ॥గీ॥అ
నిబహుప్రకారమున ధర్మతనయుండు। సన్నుతింపమౌనిసంతసించె। ననుచుశౌ
నకాదిమునులకు నెరిగించి। సూతుడని మెనిట్లు ప్రీతితోడ॥ క॥ మునిముఖ్యులార
ధర్మజు। డనయము గొనియాడ మౌనిహర్షముతోడన్। ఘనయాయాశీర్విశుభ
మున। మనుమని దీవించె మరియు మనుమని బ్రీతిన్॥క॥ దీవించి ధర్మతనయుని। భా
వించి మహాత్మ నీవు బ్రహ్మైక్యానం। దావిర్భావసుఖాకృతి। జీవన్ముక్తుండవగుమ
చెలగిట్లని మెన్॥ఉ॥ కోరికదీరలోనిదురగూరికి నెంమదినుండు చిత్తమె। వ్వారిది
నారిదే సుఖమువాస్తవమున్ మరియన్యులెవ్వరి। న్వీరికిసాటిగాబలుక వెళ్లితనం
బు బ్రహ్మతోల్లిబో। ధారతుశిష్యపాదములు ధర్మము గాశిర సావహింపడే॥
గీ॥ ధ్రువరేఖ్య ముట్టిపుణ్యాత్ముడగుయోగి। నిష్ఠుడగుచుకొంతభ్రష్టువలెను। మ
రిపిశాచబాలమత్తులపోలికె। ధాత్రి దిరుగువారకుంతలవులేక॥ సీ॥ అలయవస్థా
త్రయముల దాటిమదిలోనరజతాద్రిపటికంపురాతిపైన। నిండుపున్నమనాటిపం
డువెన్నెలవలె పట్టపగటిపట్టబయలువోలె। నిండిపండెయురిగినిబిడీకృతానంద
సై వెలుగుతుర్యసమాధియందు। చిన్మయాజ్ఞప్తిమై సన్మాత్రమంత్రమై శేషించి
యదివాసదెలగుచున్న। బ్రహ్మవిద్యాధురంధరుల్బాహ్యమందు। జాతివర్ణాశ్ర
మాచారసంస్కృతులను। సన్యసించినసంసారసంగులైన। యఖిలవ్యవహార్తంబు
లు మొందునంతరధిష॥

(జీవన్ముక్తలక్షణఘట్టము.)

సీ॥ ఆకాశమధ్యమందాకృతి వెలిలోను విషయశూన్యంబున వెలుగుచుం
డి। యంబుధిమధ్యమందాకృతి వెలిలోనుపూర్ణమై యానందమునను గ్రుంకు। న
ట్టి మహాయోగియఖిలసంచారుఁడై యొకచో యాచారముక్తిదనరు।నొకవేళ
సంసారియొప్పనచరియించు నొకచో వైరాగ్యముద్ధరించు। నొకచో భో
గియొకచోట యోగియనుచు। పెక్కుగతులనుదిరుగు నీపృథ్విలోన। యిప్పుడి
ట్లట్లంగరాదెప్పుడెట్లొ।యట్లకానుంటనిశ్చయంబవనినాథ॥

సీ॥ ఖంబ్రహ్మమనుచు నాకాశాత్మయనుచును వేదప్రమాణముల్ విమలవా
క్య। ములవినంబడుగాననలచిదాకాశంబు నిరతిశయానందనిరుపమాన। నిర్మ
లనిర్గుణనిరవయవనీరంధ్ర నిత్యనిరాకారనిర్వికల్ప। నిర్విశేషానంతనిరుపద్రవని
బద్ధనిష్కర్మనిస్సంగనిర్వికార। మై వెలింగెడుబట్టబైలాత్మఁగాంచి। మఱచియ
ఖిలంబుమఱువనిమాత్రమెఱుక।కల్గునవధూతబాహ్యనిష్కర్షఁజేసి। కూహక
ప్రవిద్య సిద్ధులఁగోరఁడధిప॥ మ॥ మణిమంత్రౌషధయంత్రతంత్రజపహో
మద్రవ్యయోగంబులం। దణిమాదుల్ గగనాదియాన మహిమాద్యంతం
బులౌసిద్ధులన్। గుణసామ్యంబులు మాయలన్నియును ముక్తుల్వేటిగైకోరు
నా। త్మనువాచార్యముఖంబునన్ దెలిసిబోధల్ గాంతురుర్వీశ్వరా॥ క॥ ఆల
స్యమేల బ్రహ్మము।బయలై యుండంగ బట్టబయలై జగముల్।యాలోననడగునం
తట। నీలోన నెనీవునిల్చి నిందుసమాధిన్॥ క॥ నిందుసమాధిని బైలై।యుండినసక
లంబుమరచియున్నని గనుమి। ట్లుండినవారికిధర్మజ। కొండొకధర్మంబుగోరగూ
డునె చెప్పుమా॥ క॥ అనిశంబిట్లుసమాధిని। తనివొందినవారిమహిమదలపగవశ
మె। కననేరకొందుర్తోవల।జనువారలభాగ్యమెంత చెప్పగవలయున్॥గీ॥ ఆత్మ
నెరిగినయట్టియవధూతసంచార। మెవ్వడెరుగునయ్య నెదురుగాను। జూపరం
బులైనకాపట్యమాగతా। దగులుచుంద్రుగానిధరణినాథ॥ క॥ సతతంబాత్మస
మాధిని।గతకల్మషభావుడగుచు గడతేరవలెన్।ధృతినిట్లుచేయకుండిన। మతిహీ
నుండగుచువిషయమగ్నతజెందున్॥ గీ॥ మననువృత్తిలేకమఱియరక్షణమైన।
నుండదగుటవలనయఖండవృత్తి।నుంచవలయుఁగానియొంచకయుండెనా। లేచివి
షయములకునేగివిడుచు॥ మ॥ అమనస్కంబు ప్రతిక్షణంబుగనగానానందభో
గంబునన్। విమలంబై హృదయంబుచల్లనగుచున్ విశ్వాత్ముడై యోగనిర్మమతా
హంకృతిజీవన్ముక్తుడగుచున్ రాజిల్లునిట్లయినగా। సమయాతీతసమత్వచిత్తము
ననిస్సంగాత్ముడౌ ధీవరా॥ మ॥ అనిశంబుంబరమాత్మజాదనియతుండౌ కార్య

నై కారికా। జనవాంఛావిషయంబులఁ దగిలి దుస్సంసారసంతాపము । గ్లాని
మందునఁ దలమెత్తలేక బలిమాలుఁ గన్నవారెల్లగా। పునదుస్సంగవిరోధి
గావలయు జీవుండాత్మసత్సంగియై మోచ॥ ప్రతినిమిషంబు బ్రహ్మమునఁ భావము గూ
ర్చక నుండువారదు। కర్మతులును పాపదుర్విషయ మగ్నులునై చెడిపోదు రంత
టఁ। గతజలసేతుబంధనముగా దవివేకము లెంచిచూడగా। మతినిదిగాంచినీ
వ్రమతిమమక్షము నొందుము పాండవాగ్రణీ॥శా॥ సర్వజ్ఞత్వముగల్గి యాత్మగ
నియు స్సంసారదుఃఖంబునై। నిర్వాణైక్యసమాధిమాత్రము వివానేర్పెల్మరె
నైన్ననుఁ। గర్వగ్రస్తులుబోవు బ్రహ్మపదసాక్షాత్కారసౌఖ్యంబునుఁ । బ
ర్వన్నేగదు చిత్తమందు జయముఁ బ్రజ్ఞావిశేషాత్మకా॥ఉ॥ కాయమనిత్యముఁ
దెలివిగానక మంత్రలయాదియోగసా। హాయములైన సిద్ధులను బ్రజ్ఞలుగా దల
పోసి మూఢులై। మాయలనందువారు నడుమంత్రపుయోగులుగాని ముక్తికిఁ।
డాయగ లేరు వీరలకు దంభమె మోక్షము లెంచిచూడగఁ ॥ఉ॥ అంబరయానసి
ద్ధులకు నాసలు సేయుచు మంత్రతంత్రమా। డంబరవృత్తి నొందరు విడంబము
నొందుటగాని ముక్తిచే । తంబసలేదు వారలకు భ్రాంతిత సంసృతి వెంటనంటి
లో। కంబుల ద్రిప్పుచుండకడగానగనిత్యక రాజశేఖరా॥ ఉ॥ మాయలు సిద్ధజా
లములు మాకడి యేమిటికంచు చిత్సుఖో। పాయము గొంది యొండొకటి భావ
న సేయక బాహ్యకర్మమం। దేయనువొందునైన మదికింపగు రీతిని సంచరించుని।
ర్మాయికి హాయిగాక మతి మంతనమందికి హాయి గల్గునే॥క॥ హాయికినోర్చి వవా
రలు। ధీయనిగగనాదియానసిద్ధుల నెల్లఁ। రోయక రోసినవారే। మాయాసం
సారహేయమానవరాయా॥ గీ॥ కాయసిద్ధులు మొదలుగాగలవియెల్ల। కుదు
రుగూరాడు చేనుక జెదరకుండ। పొదగబట్టుట మాయకాపురము గాదె। యట్లు
గావున నవి యెల్లయాత్మగావు॥గీ॥ మాయముక్తి గాదు మహిమలు ముక్తిగా। దా
శముక్తి గాదు యఖిలమును। రోసి విడుచునదియ రూపదిముక్తియా। భువన
కీర్తిజాలబోధలోల॥శా॥ రూపవ్యాపిజగత్ప్రపంచమును మదిం రోశించి సన్మాత్ర
చి। ద్బ్రహ్మానందపదానుభోగమున సంతోషించు యోగీంద్రులా। రూపవ్యాప్త
జగత్ప్రపంచవిషయారూఢక్రియాలోపమా । కాపట్యంబులనైన సిద్ధమహిమల్
గోరంత్రెంతు రేమూర్ఖులై॥క॥ ప్రాణాయామజయంబున। మానవులు ధరిత్రియం
దమరికలొన్నేడుల్। గానంగబడుదురి తే। కాని గలదె కాయసిద్ధికలలో నైనఁ॥
గీ॥ కాయసిద్ధికల్లగా కున్న నట్లయిన। కన్న విన్నవారు గలరె ధాత్రి। మూర్ఖులైన
వారు ఫలము గుదురుదురు గాక। యమరులందునైన నట్లు గలదె॥ గీ॥ హరిహర బ్ర

హ్మాసురసిద్ధవరులకన్న। గరుడగంధర్వయక్షకిన్నరులకన్న। జనకశుకవామ
దేవసన్మునులకన్న। కాయసిద్ధికినరులెంతగలరు ధరను॥క॥ జలబుద్బుదంబుకన్న
ను। చులకనభూతములచేతజూపట్టినయీ। చలనవపుసిద్ధులగోరక। వలెజాతస్వ
మరణధ్రువంబనవినవే॥క॥ కౌంతేయకాయసిద్ధిప। దంతే వేదాంతసమ్మతంబ
దియార్ధ్య। శ్యాంతన్నశ్యాంయతఃకృత। కంతదనిత్యమనుటకఫలస్విప వే॥గీ॥ కమల
జనితమగుచుకానంగబడ్డవి। చెదురటంచునాటిచెప్పశ్రుతులు। మెన్నడుచెవి
సోకకున్నదాయివిసంగ। దోవమింతెగాకదుర్జనులకు॥క॥ దుర్జనసంగతివలన।
న్వర్గాపవర్గంబులెరుగవశవడకునికిన్। యార్జించెపాపమందుల। నూర్జితసంసా
రమాయలుచితములావెన్॥క॥ అన్నిటిమూలముమదియౌది। తిన్ననగాచిల్లర
ప్పుదీరినయట్టే। వెన్నెలబైటనుచల్లగ। కన్నులపండువుగసుఖము గనుగొనవ
చ్చున్॥గీ॥ వరగురూపదేశపరుడయ్యుసతతంబు। మరిసమాధిచేయుమరిచెనే
ని। విషయసంగములకుబుషివంటివాడైన। పాలుమారుతిరిగిజాలిపడును॥సీ॥
కౌంతేయయెంతధీమంతుడౌవాడైన సతతమాత్మదలంపజాలకున్న। విషయ
ముల్లలపారువిషయసంగంబులగోరినయుదయించికోర్కెవలన। క్రోధంబుపు
ట్టునుక్రోధంబువలనను మోహంబుపుట్టును మోహమునకు। వెనుకటితెలివెల్లవీ
టిపాలైపోయిపోయినయా బుద్ధిపోణిమడగు। పోణిమణగినగతిలేకపోవునంత।
మొప్పటగచాట్లువచ్చుబదక్లెరింగి। చిన్మయశ్రీమహాలక్ష్మిచెట్టబట్టి। యచ్చికము
లేకయుండుటల్మెచ్చుగాదె॥క॥ తనుమాలిధర్మమేలా। తనగురుతెరువెరుగలేని
తనువదియేలా। తనబుద్ధిగానిదేలా। తనుదనకేకాకయున్నతనువదియేలా॥క॥
అదికానవీవుచిత్తము। కుదురైయుండంగజేసి కోర్కెలనెల్లన్। జిదిమిపరబ్ర
హ్మమునందదినేశుడవగుచువేడ్క దనరున్నృపాలా॥క॥ పెక్కులుపనియేమింక
ను। నక్కరతోబ్రహ్మబోధమైనీవాశం। జిక్కులబాగయగబుద్ధిన్। జిక్కించుక
సౌఖ్యమందుశివయోగనిధీ॥క॥ అవనీశాగ్రణినీవి। శివయోగసమాధియందు
చిన్మాత్రంబై। సవినీతిసుఖంబుందుము। భవపాశపరిహితపట్టభద్రుడవగుచున్॥
క॥ గురుకారుణ్యంబునసిహా। పరమాశోభనపరంపరావాప్తిసమీ। వరువక
మనసునునుంచుము। పురుషార్థపునీతిపూతపురుషవ్రాత॥క॥ అనిబహువిధముల దె
లిపిన। మునివరునకుధర్మజుండుముకుళితకరుడై। వినయాభయభక్తిపలికెను। నన్న
ఘాయింకొకప్రశ్నయడుగన్ వలయున్॥క॥ దంభపరిత్యాగనిరా। డంబుల
చేసైనమోక్షులక్ష్మికలుగ। ణంబాద్యంతంబునుసాంగంబుగవినుపింపుడన్నద్ధ్మ
కారణగురుడన్॥ క॥ మదినీప్రశ్నకుమెచ్చిన। నిదిసకలతపఃఫలంబులీకతలె

కా। మొదలిటి వేల్పులు మునులును। ముదమందుచునుందు రెల్ల ప్రొద్దున రేంద్రా॥
క॥ వినునీవడిగిన ప్రశ్నకు। ననుభవులగు యోగివర్యు లాశ్చర్యములన్ । గననీ
కౌకకథలనుగా। మునముక్తిరమావివాహమున్వినుపింతున్॥క॥ నరవర హెచ్చ
దివినుమీ। పరకాంతాశోభనంబు పరమరహస్యం। బెరుకకు నెరుకై యెరిగిన ।
యెఱుకసుమీదీని తెలియనెటువలెననిసన్॥సీ॥అధికవైభవము బ్రహ్మానందనగరం

(మోక్షలక్ష్మీవివాహఘట్టము.)

బు గలదు మిన్నులముట్టి వెలుగుచుండు। కోటచుట్టునగద్దై మేటి ప్రపంచంబు ద్వా
రముల్ప్రవితర్క వాదబలము। వేదాంతసిద్ధాంతవీధులు విషయేంద్రియంబులంగ
ళ్లు దేహాత్మబుద్ధి। వర్ణాశ్రమాచారనిర్ణయధర్మముల్కరితురగాదులు కర్మఫల
ము। దృశ్యదర్శనరాగముల్ స్త్రీపురుషులు। గాగయఖిలదృగాశలంగలిగినట్టి। ప
ట్టణంబేలు సద్గురుపట్టభద్రు। డాత్మకాంతాసమేతుడై యవనినాథ॥ క॥ మరి
యన్నగరంబేలెను। గురునాథుం డొక్కనాడు కోవిదవినుతా। స్థిరహంసమం
టపమునన్। స్థిరపీఠమునందు గొలువుదీరుచునింతన్॥సీ॥ జననాథ దేశిక స్వామి
విద్యామంటపము వెలియంతఃపురమునకపుడు। బోవుచో నాధారపుష్పకంబెక్కి
స్వాధిష్ఠానభూమి నతిక్రమించి। కమనీయమణిపూరక యనాహతవిశుద్ధచక్ర
ముల్గడచి నిర్వక్రమైన । మరియు నాజ్ఞాచక్రమందిరాంతర శ్రీలక్ష్మియమరు రాజె
ట్టబట్టి। హంసతూలికతల్పమందమరగలసి। రెప్పవేయని యరగంటిదృష్టిగలిగి॥
గాఢరతులను నిద్దరైక్యంబులైరి। యప్పుడిదమిత్థమనరాని యొప్పుచేత॥ వ॥ ఇటు
లత్యంతక్రీడావినోదంబులం బ్రొద్దుబుచ్చుచు నేకాంతప్రదేశంబులమరియును॥
ఉ॥ ఆసతితోడ గూడి నిగమాంతవనాంతర యోగభూమికా। వాసగృహంబు
లం నిజనివాసగృహంబుల గ్రీడసల్పస। ద్వాసనగర్భమైయు విద ద్వాదశవత్సర
మునిండునంతన। ట్లాసమయంబునందు పరమామృత కన్యను గాంచె భూవరా॥
గీ॥ పరగనిట్లు గలిగి పరకాంత నవయావ। నాంగియను చు ధరణి నార్యులెల్ల। మె
చ్చి కోరుచుండ మేలైన సౌబగుల। కలుషభంగ హృదయకమలభృంగ॥క॥ ఆకాం
తామణికి నిమరి। యేకాంతలు సాటికారు యేకాంత మునన్। యాకాంత గూడగ

(ముక్తికాంతాజననఘట్టము.)

ల్గిన। చేకూరును సర్వశుభము చిన్మయరూపా॥క॥ మోక్షశ్రీలలనామణి। లక్ష
ణవతి సర్వశుభవిలాసవిశేషా। ధ్యక్షువిచక్షణలక్ష్య। లక్షణఘనదివ్యరూపలక్ష
ణములచేన్॥వ॥ మరియునిట్లు సర్వశుభలక్షణాంగి యగుతనకూతుం బెండ్లిసే
యదలంచి యొక్కనాడు॥ గీ॥ చిన్మయానందపట్టాభిషిక్తుడపుడు। మోక్షలక్ష్మి,

స్వయంవరంబుపురిలోన। జనులలంకారములుసేయ శాస్త్రరీతి । చాటబంపె
నుసజ్జనసమ్మతముగ॥గీ॥ ఆస్వయంవరమునకఖిలదేశస్థులు। వినిముదంబుగదు
రవేడ్కచేత। వచ్చిరపుడుపురమువర్ణనాలంకార। ములనువన్నెకెక్కి చెలగు
చుండె॥ క॥ ఆపట్టణశృంగారము । జూపట్టెనుసర్వజనులజూడ్కికిజూడ్కి।
మేపట్టునసరిలేదని। కాపట్ట్యములేనిజనులు కౌతుకమందన్॥ క॥ నానాదేశాధీ
శులు। నానాలంకారములను నానార్థములన్। నానావేషంబులచే।నానాభావ
ప్రచారనటనలతోడన్॥ క ॥ ఒప్పచునుండిరియప్పురి। యొప్పులకుప్పగుచునిట్టు
లుత్సాహముతో। జొప్పడియెసంతనొకనా। డప్పరమేశుడగుపతియుహర్షము
తోడన్॥ సీ॥ నగరుశృంగారింపనిగమార్థరీతిని నేమింపనప్పుడునేర్పుతోడ।మా
నసాఖ్యులువట్టిమలతోరణంబునుగాగ వాసనమేలుకట్లుగాగ । కర్మఫలంబు
నాకస్తూరినలకించికుండలిభ్రమగ్గులు నిండదీర్చి । చిత్ప్రతిఫలితమాచిత్తరవులు
వ్రాసి నేత్రోత్సవంబుగానఖిలమైన । శోభనాలంకృతులొనర్చిస్థూలసూక్ష్మ।
కారణంబులమంగళాకారములుగ। జగతివైచిత్ర్యమెల్లదక్షణమెసేయ।కొలు
వుశృంగారముగరాజుకోరియపుడు॥ సీ ॥ ఘనవస్త్రచయములుక్రమమొప్పధరి
యించి నుదుటతెల్విసమ్మృగమదముబెట్టి । పరిశుద్ధవాసనాభరితస్రక్చందనాదు
లనలంకారంబులలవరించి। శిరమునగురురత్నవరకిరీటముదాల్చి శ్రుతులచౌక
ట్లువిశ్రుతులమెరయ। కంఠమాలవిశుద్ధకమలమనాహత చక్రపతకముపక్షము
నవెలుంగ। సారదిమణిపూరకముకటిసూత్రముగను।కరములనుజనాభయదా
నకంకణాది। భూషణంబులువేర్వేరపొలుపుమిగుల। చూడనొప్పారెగురురాజు
సుందరముగ॥ సీ ॥ ఉభయపార్శ్వంబులయోగబోధస్త్రీలు వింజామరంబులు
వీవుచుండు । నాదాంతభోగసుందరివేడ్కదండ యిచ్చిసుభాషితంబెలమి
నాడ। చిచ్ఛక్తిమొదలైనశృంగారవతులెల్ల ముందరకైవారములునుసేయ।స్వ
ప్రకాశాసతిసరసవిడియమియ్య తనుతలోదరులునృత్యములుసలుప । ప్రణవ
భేరీమృదంగఘోషణముచెవుల। పండువులుసేయకన్నులపండువుగను। వరసు
షుమ్నాంతరద్వారవతిగాయగుచు। చేరెపతియాసహస్రారశిఖరికపుడు॥సీ॥ వే
దాంతసిద్ధాంతవిద్యావినోదమంటపమునసిద్ధాసనంబునందు। కాయమ్రుగ్గులు
దీర్చికడగంటిసూటుకలుకలియంగనలికించికలకదీర్చి। సమదృష్టిభూరివధ్వసం
కల్పగోష్టియు నిర్మలంబగుతెల్విసజసుఖంబు । గల్గిసర్వజ్ఞుడౌఘనరాజయోగ
సామ్రాజ్యములనుమొదల్రాజబుధుషభు। జేరసర్వసనాహముల్ధీరివచ్చి।రపు
డుసర్వజనంబులునంతనెలమి। మోక్షలక్ష్మికిశృంగారములనుజేయ । గడగిరం

తఃపురస్త్రీలుకడకతోడ॥ క॥ మంగళమనియక్కన్యకు । రంగుగసుఖరసముబ్ర హ్మారంధ్రమునం టఁగ । గంగావాణీయమునల । సంగతిజలమొకతెదెచ్చిజలక ములార్చెఁ॥ సీ॥ కన్నులపండుగాకనకాంబరముగట్టి మెరుపునునువుగా మెర యగొప్ప। సవరించిదళసహస్రములొప్పగాదురిమి వెలుగుపాపటజెట్టితలవు నుచుట। తిలకంబుశ్రుతిదీప్తిపోజులకమ్మలు గళముకుత్తుడిచూడిక్కతగినయా ణి। ముత్యంపుముంగరమురువుగాగవిశుద్ధకమలాదిహారముల్కంఠమునను। న మరమొలఘంటమణిపూరకాదులిట్లు। ప్రకృతియావర్ణరహిత సంభారణముల ను। యాకరచరణాద్యవయవాంగములనొప్ప। సతుకన్యనుశృంగారవతినిజే సి॥ గీ॥ దర్పణంబుదృశ్యదర్శనద్రష్టగా।యెదుటనిలుపగన్ను జెదరనీక। జూచిచో ద్యమందిసుందరాంగియపుడు। తండ్రియనుమతమునధర్మనియతి॥ క॥ ఉపరతి యనుచెలికత్తెను। విపులంబుగజెట్టబట్టివేదాంతజ్ఞా। నపథంబునహంసగమన। ముపరిహసింపుచునువచ్చెభూపతిసభకుఁ॥ క॥ వచ్చినకాంతామణిగని। యచ్చెరువడిసభికులెల్లనానందముతో। నుచ్చటకజొచ్చితమలో। యిచ్చెలిదమత మకెయంచుయెంచిరివేడ్కఁ॥ క॥ ఈరీతివారువారలు। కోరుచునోరూరుకొ నుచుగుణవంతులునై । మీరుచునుండిరియంతట । వారింగనిసఖినిచూచివైభవ యుక్తిఁ॥ గీ॥ వరుసవారివారివర్ణాశ్రమాచార। నటనలుకులగోత్రనామముల ను। చెలినడుగుమటంచుచిన్నారిస్త్రీమణి । యనుమతింపనదియునడిగెనందు॥ క॥ ఆకారముమసలిముచుక। వాకునకారెనుముపోతువలెబలిసినయా। లౌకిక పుమహారాజువి। వేకముపేరడుగవాడువికవికనగుచుఁ॥ సీ॥ కోరియిట్లనియె మాకులముపెద్దలుమెచ్చయిలువమసమానుషంబెన్నగల్గి । యిచ్చిపుచ్చుకొను చుయింటబల్లముగల్గియెందుకునచ్చికంబింతలేక। నాలుబిడ్డలుమేమునాయుష్య వంతులైయలజల్లబొందకపోయమనుచు । యొకనిప్రాపాసించకున్నందులో మంచిసంసారియనసరిసాటిగల్గి। యిల్లువాకిలిదనవారుచల్లగాను । నుండగలు గుటమోక్షంబుయోగిజోగి। గాగవచ్చునుసంసారిగాగరాదు।ననుచుబలికినలౌ కికునపహసించి॥ గీ॥ కనిరియాకారపూజ్యముల్కలిగినీరు। కావిదోవతులుంగ రాల్కనకకుండ। లములులంబోధరత్రిపుండ్రములనొప్ప । కావ్యాకర్మాధిపుని నంతగడగివాడు॥ ... ... ... ... *

*( ముక్తికాంతాస్వయంవరఘట్టము. )*

ఉ॥ తామసమొందరాదుపరదారసుగోరెడిదోసకారితో। నేమరిపా టునైనబలుకెన్నడుగాదువిశేషకాలమం। దేమరరాదుదానములుహీనజనా

వళిసంగమెన్నడు। న్నేమము గాదుయిట్టిదియనినిర్ణయమన్నను దాటియవ్వలన్ ॥
మ॥ చనికార్శ్యంగుని వేషభాషణలచే సన్యాససంసారము। ల్గనగానీనినిరాశ్ర
మున్ ఘనకుతర్కగ్రాహ్యువాత్మస్తవా। ర్థినిమోహేంద్రియనిగ్రహున్నిఖిలది
గ్దేశాదిసంచారువా। యమికోధవ్రతునీశ్వరార్పణఫలా భ్యోక్తృర్వీపతిన్ గాంచు
చోన్॥ వ॥ తనవర్ణంబునకాశ్రమంబునకునన్ దగ్గట్టిధర్మంబుప్రీతిని సేయన్ వ
లె సేయుచో ఫలమువా దేవాదిదేవస్వరూ। పునికర్పింపుచువామ్యకర్మముల నై
బోకపుణ్యస్థలం। బునివాసంబునసద్వివేకమునసత్పుణ్యాత్ముఁడయి యొప్పెడున్
సీ॥ తనవారిగన్నట్లుదనవారిగనవలె సర్వభూతదయకుసాక్షిగాగ। తనవంటి
యాకలేయునిపరదేశికిముందరికూడైనపెందలాడె। బెట్టంగవలయును బీదనై
వచ్చిన యాతనికలకొద్దివంపవలయు। స్నానపానాదులుసంధ్యార్ఘ్యానుష్ఠాన
ములుగల్గిలోకంబుననుసరించి। నడువవలయును సర్వంబునడకవలన। తోచుచుం
డుము పెద్దనైదొడ్డతనము। యిహము మేలెంచనడచిన నిహమవారె। పరముగాం
చంగనేర్తురుప్రజ్ఞతోడ॥ వ॥ అదియునుంగాకవర్ణాశ్రమాచారంబులందుబ్రహ్మ
క్షత్రియవైశ్యశూద్రులలో బ్రాహ్మణునకును యజనయాజనాధ్యయనాధ్యాపక
దానాదానప్రతిగ్రహంబులను షట్కర్మంబులును క్షత్రియులకు ప్రతిగ్రహవ్యతిరి
క్తంబులగు నైదుకర్మంబులును వైశ్యునకు కృషిగోరక్షవాణిజ్యాదికర్మంబులును
శూద్రునకు బ్రహ్మక్షత్రియవైశ్యాదిసేవయును మఱియువర్ణంబులలో బ్రాహ్మ
ణుండు శ్రేష్ఠుండగుటం జేసి యందు బ్రహ్మచారిగృహస్థసన్యాసంబులను నాలు
గాశ్రమంబులుగలుగుటం జేసి మొదల బ్రహ్మచర్యంబున శిఖాయజ్ఞోపవీతమౌం
జీకృష్ణాజినదండకమండలధరుండై వేదాధ్యయనాదిసత్కర్మరహితుండై స్త్రీ
సంచారస్థలవర్జితుండై గురుగృహవాసుండై యాచార్యాజ్ఞాపనంబున భిక్షాన్నం
బు పరిగ్రహింపుచు క్షౌరాదికర్మరహితుండై సంచరింపుచు నంతనాచార్యానుమ
తంబున వివాహాదిగృహస్థకర్మంబులంగీకరింపుచు గురునిచేత నియోగింపబడురీతి
నిమంత్రశంతజపహోమవ్రతనిష్ఠుండై వేదశాస్త్రపురాణకథాశ్రవణతత్ప
రుండై వానప్రస్థసన్యాసాతిథిపూజలును జననీజనకపుత్రమిత్రకళత్రభ్రాతృపశు
భృత్యజనపోషణంబులు సేయుచు పంచపర్వంబులు వ్యతీపాతాదిపుణ్యకాలం
బులుదక్క తక్కినఋతుకాలంబుల భార్యాసంగంబు సేయుచు ధర్మార్థకామం
బుల సంచరింపుచున్ పెద్దకాలంబునకు స్త్రీసహితుండై సంసారధర్మంబగు గృ
హంబు విడిచి వనంబులకందమూలాద్యాహారుండగుచు ద్వాదశ వర్షంబులైన
వానప్రస్థాశ్రమంబునందుండి సన్యాసాశ్రమంబంగీకరించి యింద్రియజయంబు

కలిగి పుణ్యప్రదేశ సంచారుండగుచు దేహశక్తిలేక పరమవైరాగ్యంబునస
ర్వేశ్వరధ్యానాది భక్తిసత్కర్మంబులు సేయుచు తత్కర్మఫలసంతవర్జితుండై
యుండవలయు సర్వవర్ణాశ్రమంబులలో నెవ్వడైనను ధర్మార్థకామంబులు పరి
త్యజించి మోక్షమాత్రాపేక్షితుండై శాంతుడై యేకాంతప్రదేశంబుఁ జేరి య
మనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణసమాధులను నష్టాం
గయోగంబుల సర్వసిద్ధిప్రదుండై లోకపూజ్యుండగుచు సంచరించుచుంతం దుత్త
ముండనినమిశ్రసాత్వికకర్మయుక్తుండైన ఫలత్యాగివాక్యాడంబరంబుల కాశ్చ
ర్యంబునొందుచు నుపరతి సఖిచేయూతఁగొని యుండొక్క నానావిధ భేదస
భామధ్యంబున నిల్వంబడి వారలనిశ్రేయంబెఱుంగంగోరుటయగు నుపరతివాక్యో
త్తరంబుగా వారలందు ॥ సీ ॥ ఒకఁడాత్మయణువని యుక్తిసాధించిన విభుడని
యొక్కఁడు విరిచి వేసె । దేహాత్మబుద్ధిగా దెలిపినయొక్కఁడు కాదుప్రాణమటం
చు గదరిపడిమె । సిద్ధులాత్మ యటంచు జేసిన వేఁ గొకం డాత్మమానసమనిహం
కరించె । త్వంపదప్రాప్తికి సరియుక్తియనఁగ వేఱొక్కఁడు జ్ఞప్తి కానుకఁ
జెనగె । నొక్కఁడానందమే ముక్తియోగమనుచు । నాత్మభేదంబు వాదిం
పనందునొకఁడు । సంవిదాకాశముగ దన్నుసద్గురూక్తి । గనుట మోక్షం
బె యనధర్మతనయ వింటె॥ వ॥ అవియెట్లంటేని నానావిధ భేదవాదుల మధ్యంబు
న శాంతుండును సర్వదృశ్యవైరాగ్యవంతుండును నిశ్చలభక్తుండును సద్గురూక్తు
తివిశ్వాసయుక్తుండును నగు నొక్కఁడు భేదవాదియహంకారరహితంబగునిర్గు
ణోపాసనాక్రమంబు గా నిట్లనియె॥ క॥ వినుధర్మజనీవైనను। తనుకరణేంద్రియ
ములందు తగనారోపించుచునహంబుద్ధితొలంగి। చనవాచ్యతస్వస్వరూపచైతన్య
మునా॥ గీ॥ ప్రత్యగానందకూటస్థపదమునందు। నాయహంప్రత్యయోపసంహా
రచిత్తు। యిప్పుడదియె బ్రహ్మాస్మి ప్రాప్తి చొప్పడంగ । ననుచు వేదాంతవాదివా
క్యములు గాఁగ॥ వ॥ మరియుధర్మజుతో నమ్మౌని యిట్లనియె॥ సీ ॥ అక్కడట్లేయ
హంబనుబుద్ధిగా సుఖదుఃఖములు మరిసోఁకదిగాను । నరయనిచ్ఛాద్వేషయత్నధ
ర్మాధర్మభావవిశేషణావళులమరియు । కణగిసంఖ్యాపృథక్సంయోగభాగాది
పరిణామములచేతఁబలసినట్టి। సామాన్యగుణములు సవిశేషమై దేహకరణేంద్రి
యంబుల మొరసియుండు। నాత్మబుద్ధినివర్తించు నాగుణంబు । లవియ కూటస్థచై
తన్యమునగరాదు। సుప్తికూటస్థుగూడమే సోఁకదిగుణము । లరయులేకుంటనహ
మునననగెఁగాదె॥ క॥ అలజాగ్రత్స్వప్నంబుల। తెలియగనభిమానమున్నదియు
గుటగుణం। బులువుడె సుప్తికాలం। బులకనకుంగారణాఖ్యభూతావిద్యన్॥

క॥ అభిమానమణఁగఁగనుకగు। యభిమానమునం దెగుణములణఁగినయట్లా। య
భిమానముగుణిగావలె। యభిమానమెకరణసంజ్ఞ లవనీనాథా॥ గీ॥ అరయవా
చకపాఠకమనినయట్లె।యహమునఁగుహృత్తమోబుద్ధులనఁగఁజెల్లు,కరణసంజ్ఞ [illegible]
నపియుపో కానుపించె। నాయహంకృతితనుధర్మమంటివేని॥ క॥ మృతికాలంబు
న దేహము। సతమైయహమునికిలేమిసహజంబౌటన్। సతతముతనుధర్మమ
హం। కృతిగాదనుటల్ నిజంబుధృతివెలియంగన్॥ గీ॥ ఐనఁబ్రాణధర్మమభిమాన
మంటివా వరలనిదురఁబ్రాణవాయువుండు। గానమందునహముగావుననదిప్రాణ
ధర్మమనఁగరాదుధర్మతనయ॥ మ॥ ఘనకూటస్థమునిద్దురంగదలహంకారంబులే
దందుఁగ। న్గనహంకారములాత్మధర్మమనుటల్గాదాయహంకారమా। త్మను
గాంచేపరియంతమున్నలయవస్థాద్వంద సంచారియై। తనరున్ గారణమైనసు
ప్తియణఁగున్ తత్త్వానుభోగోజ్వలా॥

సీ॥ సుప్తిమాయవలనజూపట్టుజాగ్రగాది। స్వప్నకృత్రిమములుసరగతనకు।
కారణంబుతనకుఘనసుప్తిమాయలో। నణఁగుచుండునహమునను దినంబు॥గీ॥గు
రుసుషుప్తిలోనకూటస్థచైతన్య। మైనయెఱుకయాంగదుటందులకును। గుఱుతుని
దురలేచిమెరుఁగనిందాకనే। ననుచుదిరుగుచుంటయాత్మగాదె॥ ఉ॥ కానసుషు
ప్తినిందెలివిగల్గదుగల్గియునేలగానడ। ట్లానిదురందుమేల్కనిన యప్పటియట్ల
నజాగ్రమందుకు। న్మానససాధకంబునభిమానముసుప్తినిలీనమౌటచే। హీనవి
కారమై యెఱుకయేమియెఱుంగకనుండుపాండవా॥ మత్తకోకిల॥ అన్నివృత్తులు
సుప్తిగూడినయాత్మయున్నదితెల్విమే। లొక్కన్నయెప్పటిబోలెజాగ్రతనోర్క
లేమియులేక యి। ట్లున్నయాత్మకునందుసౌఖ్యములుండుటెట్లగునంటివా। ము
న్నుదెల్పునవిద్యవృత్తికిమూలమౌటయవిద్యచేన్॥ గీ॥ ఆత్మసుప్తిలోననజ్ఞానవృ
త్తిచే। సుఖమునందుటకునుసారదిజూడ। కార్యరూపమైనకరణంబువృత్తిచే।మ
రలకారణంబునందుటగుదె॥ గీ॥ కార్యపటమునందుక్కారణతంతువు। లమరగప
టనిష్టమైనతెలువు। తంతునిష్టమగుటతగుబుద్ధికినివృత్తి। గల్గతమమునందుగలదు
వృత్తి॥ వ॥ అట్లుగావునకార్యరూపంబైనబుద్ధికిజాగ్రత్స్వప్నంబులకువృత్తిగలు
గుటజేసి కారణరూపంబైనయజ్ఞానస్వభావమనుసుషుప్తియందజ్ఞానంబునకు
వృత్తిత్వంబుగలదనియెఱుంగవలయునట్లగుటసుషుప్తిమూర్ఛలకాధారంబైన
తెల్విగలుగుటసత్యంబైనజాగ్రతునందలిబుద్ధియునుసాధనోపాధిబలంబువలన
సుషుప్తివిస్మరించినట్లజ్ఞానవృత్తియునుసాధనోపాధివలన నాత్మజాగ్రంబులం
దలంచుగా కంటివావిచిత్రవాక్యంబుల నెఱుంగునందుకు శ్రోత్రంబులుదకర్త

కర్ణనేత్రాదులు సాధనంబుగాని దెట్లట్లు జాగ్రంబును స్మరించుటకున జ్ఞానవృత్తి
త్వంబులు సాధనంబులుగా నేరదట్లయనసుషుప్తిమూర్ఛలకు భేదంబెట్లన్నజ్ఞాన
స్మరణమాత్రంబులుమూర్ఛయనిపించుకొనుసుఖజ్ఞానానుభవరూపస్మరణద్వ
యంబునుంగూడి సుషుప్తినుండితదాధారచైతన్యంబు అవస్థాత్రయంబుతోడ
గూడి చెడక నాధారమాత్రంబైయున్నయట్లనేక శరీరంబులుప్రోచిచెడునప్పు
డాధారచైతన్యంబునాశంబునొందదన్లైననాతెల్వియనేకదేహంబులకాధా
రంబైతత్తద్దేహవ్యాపారజ్ఞానంబును తనకుదెలియవలెననుప్రమాణంబులేదె
ట్లన్నమాతెంబులవలననైనస్థూలశరీరంబులుతొల్లిచెడిననప్పొటనాదేహంబు
లకాధారంబైనయాత్మయొక్క మాయావరణంబువివేకజ్ఞానోదయపర్యంబు
నునివృత్తిగాదగుటంజేసితత్తద్దేహవ్యాపారజ్ఞానంబును దోపదట్లందువలనస
కలదేహంబులందునుండాకలదనేపట్ల తత్తద్దేహవ్యాపారంబునుందనకుండవ
లెననేటందులప్రమాణంబులేదనేకశరీరంబులందుండితావచ్చితి నేనపట్లతద్దే
హకరణేంద్రియవ్యాపారజ్ఞానంబును నందందుకుభేదంబైతోచి చెడునప్పుడా
దేహంబులకుండా నాధారంబైయుండినను నిశ్చయంబెట్లుచెడదట్లు జంగమ
స్థావరాత్మకంబైతోచు సకలదేహంబులకు తానాధారంబని తెలియవలయు
నట్లయినవ్యవహారజ్ఞానంబెట్లన్నభేదంబైతోచుచుండుననినదిసంస్కారభేదం
బువలననభిమానంబునకుదోచినజ్ఞానంబింతయేకానియాత్మసంబంధంబులేదను
నిశ్చయంబట్లయిన నాత్మకుసర్వదేహధారణత్వంబున నదిసర్వదేహవ్యాపా
రజ్ఞానంబగుగాకంటివేని॥సీ॥ అప్పుడట్లఖిలదేహవ్యాపకజ్ఞానమాత్మనచిత్రగు
పాదులాత్మ। శిరములువెయ్యైనపురుషుడాత్మంటివానప్పడేశేషాదులాత్మయ
గును। నతులువెయ్యైనయతడాత్మయంటివాయప్పుడింద్రాదులుయాత్మగారె।
పాదముల్వెయ్యైనబలుడాత్మయంటివా యప్పుడుసూర్యాదులాత్మగారె। హ
స్తములువేయుగలయతండాత్మయనిన। కార్తవీర్యబాణాసురుల్గారెయాత్మ।
నైమైనశృతులునుబహువిధంబంటివేని। శ్రుతివిరాట్పురుషావస్థజూపిచెప్పె॥క॥
అల్పశ్రుతితాత్పర్యంబటు। వలెనువిరాట్పురుషరూపవర్ణనమింతే। తెలియప
రబ్రహ్మంబందలితాత్పర్యంబుగాదుధర్మతనూజా॥సీ॥అదిగాకదేహంబులర
చట్టలనుబోలెతగతదాధారచైతన్యమునకు। నవయవాత్మకమున్నానాయురచట్ట
లచిరిగినమనుజులఘునయవయవ। ములతోచునట్లంగములుచిహ్నమగుచోట
నాత్మస్వరూపముహస్తపాద। ములనుండవలెనింకబాలినణురూపముయ్యవ
హారించాత్మదానంటివేని। ఒనరవ్యవహారములనుసంయోగబలము। చేతనుప్ర

భావిశదంబు చేతనగునో। యనివికల్పపరంపరలనము గాను। తోఁచుచుండుదుమనీ
రీతిదోషమార॥క॥ అణువనిగురువిభువనియును। యణువిభువులునాత్మ గావు
యలమనసనియుఁ। ఘనతర్కవాదభేదము। లనుదగ... బవ
డెరుగుఁ॥క॥ అనవినిధర్మజుడని...
యణువునతీతంబని... ట్లను శ్రుతికిఁ ధ్యానకాండ... ॥గీ॥ అనఘు
శ్చయజ్ఞానమెట్లంటి వేని। యఖిలదృశ్యవిలక్షణమయిన... నిర్గుణజ్ఞప్తిచైత
న్యమాత్రమిదియ। వేదవేదాంతసిద్ధాంతవేత్తనిజము॥తరువోజ॥జననాథవినవ
య్యసకలశాస్త్రములసారంబునిర్గుణజ్ఞప్తిచైతన్య। ఘనచిదాకాశసాక్షాత్కా
రభోగకారణాత్ములచేత క్రమమొప్పనట్లు। గనుపడ్డసుఖిసుఖము నీకనుగంట
చూచికడతేరిసుఖముండుకరమొప్పననుచు। వినుపించివ్యాసులవివిధవాదముల
విజయోక్తినద్వైతివెలసెననిపలికెఁ॥క॥ నీవేననువ్యవహారత। జీవుండజ్ఞానవ
శతజెందుచుదనలో। జీవత్వమెరుఁగనేరక। సావయవశరీరమాత్మయనియెదలం
చుఁ॥గీ॥ నరవరేణ్యయిట్లు నానావిధంబైన। దృశ్యమార్గంబులను దిరుగునహ
ము। డెలసితన్నుదానె తెలియంగవలెనని। తగనభేదవాదధర్మయుక్తి॥

క॥ నానాసభాంతరంబుల। నానావిధతర్కవాదనటనలకెల్లఁ। బూ
నిత్పణికారముగా। దానేజయమందెధర్మతనయమహాత్మా॥

వ॥ అని యివ్విధంబున నద్వైతతత్త్వంబెఱిఁగించి పరామృతజ్ఞానోల్లా
సియగు యుధిష్ఠిరుంజూచి మోక్షంబు సద్గురుకటాక్షవీక్షణావిశేషంబువ
లనసులభంబుగానిష్కర్షాభ్యాసయోగంబులవాయునిరోధంబులప్రయాసంబు
ను రోగాస్పదంబునగురోగంబులకు దప్పిననిష్ఫలంబగు గాని అందువిశేషంబు
లేదు గావునసద్గురుసేవామూలంబున సంభవించినయాత్మయోగంబున జాగ్ర
త్స్వప్నసుషుప్తులనతిక్రమించినిష్ప్రపంచంబయినదిర్భరానందసముద్రంబునము
నింగితెరువుమరుపుస్వరూపానుసంధానమొఱుకచెడ వేదాంతంబుల నిరాభా
సనిర్వికల్పనిష్ప్రపంచనిర్వాణనిర్వికారనిత్యశుద్ధసనాతనబ్రహ్మావంశంబునరజ్జు
శుక్తిస్థాణువులయహిరజతచోరాద్యారోపణములయట్లుదోఁచిన మాయాప్రపం
చంబుదబ్బరగుటంజేసి రతుండయితన్నుదాఁదెలిసిముక్తుండగు మాయామాన
సవిభ్రమంబు తన్నునెఱుంగమింజేసిబద్ధుండగు యీబంధముక్తులునాత్మకు లే
వుసంకల్పస్వభావంబులు కాననీవాత్మమహత్తత్త్వంబుజీవన్ముక్తుండవై సర్వభో
గంబులుబొందుచుసుఖంబుండుమనిమఱియునిట్లనియె॥ఉత్సాహవృత్తము॥ వెల
యనట్లువారివివిధవాదములనుయుక్తులజయించిధైర్యమొప్పగసరుక్కృపోక్తిదన

రగా। జెలఁగిముక్తికాంతవానిజెలికిజూపిప్రియముతో। తలపులోవరించిమించుచెత
గినయట్టివరుడనె॥ పంచచామరము॥ పరాపరస్వరూపమైనభాగ్యసంపదోద

### ( ముక్తికాంతవివాహముహూర్తఘట్టము. )

యన్। నిరాకరించరాదయా యనేకజన్మశీలుడన్। మఱన్మరింపరించిమించుమ
న్మనోవిపాశుడన్। ధరాతలాదినాథముక్తిదైతవానిచేరుచున్॥ తరల॥ కరగతం
బగుపుష్పమాలికె ఖండిపాదగజాంకుశా। భరణకంఠమునంచువ్రేయుచుభక్తి
వానిసఖ్యురా। ల్వరగబెండ్లికినామతింపగబ్రష్టాబాధఁమామణిన్। గురువ
రేణ్యునిర్మోలనిల్పెనుకూర్మితోన్నృపాలకా॥ అంబురుహవృత్తము॥ అంతటనక్క
డ పెండ్లికొమారుడుహర్షచేలమువాసనా। క్రాంతసుగంధసుపుష్పములంద
ముగా ధరియించుచుజిత్తవి। శ్రాంతికిరీటముదాల్చుచుల శ్రుతశబ్దకుండలుడవు
లువే। దాంతనిజాభరణంబులునొప్పగ హంసవాహనుడయ్యెనృపాలా॥ అల్పా
కక్కర॥ వైరాగ్యమార్గముననాదవర్ణ। నారావములుచెలంగనపుడునెలమి।నా
రాజుకొలువునహంసడిగ్గి। జేరంగదావచ్చెచెలంగియతఁడు॥గీ॥ అపుడుసా
ధనసంపన్నదౌమిముత్తులు। డాగురూత్తముకృపకర్హమయినయట్లు। కొలు
వుజేయుచుదనరెనుకూర్మినంత। సకలజనులనుసంభ్రమోత్సాహములును॥గీ॥ ప
రగనిట్టుసమయపతులుగొందరుమనో। కుటిలులగుచుమాయగూడిజనిరి।నిఖి
లబంధయుక్తినాస్థానమంటపం। బపుడువెడలెగురుఁడుహర్షమునను॥సీ॥ సక
లార్థపరివారజనులు సేవింపంగనిగమార్థములు నొప్పునగరిలోన। మండలత్ర
యములదండికివ్వలిచెంతపూర్వహృద్వీధికిపాడవుగాను। యూర్ధ్వకుండలికిసనై
శవైనతావుననాలుగుత్రోవలనట్టనడుమ। నమరుబోధామంటపాంతర్గతానం
దవిజయాఖ్యకల్యాణవేదికందు। వేలస్వస్త్రీసమేతుడైవేదరీతి। నమరకన్యయు
విన్నవాడట్లమరియు। మంగళస్నానములుచేసిరంగుమీర। పెండ్లిపీటలమీదనుబ్రీ
తిజెలగ॥తరువోజవృత్తము॥ మంగళద్రవ్యముల్మంత్రోక్తిదనరాగ మంగళంబు
లుదాడమరియునంగనలు। మంగళతూర్యముల్మహిమజెలంగమధుపర్కములు
తత్త్వమస్యాదివాక్య। సంగతినర్థముల్జాడలుగాగస్వస్తికారోహణస్థలిపీఠమున
ను। సంగతిస్పర్శదీక్షాభాషికములుసరవిగాతెరనేత్రసమదృష్టినమర॥వ॥ మఱి
యానతద్వ్యావృత్తిలక్షణతటస్థలక్షణస్వరూపలక్షణంబులనుతలంబ్రాలు బో
యుచు గురుదేవతాసన్నిధానంబునతత్త్వమస్యాదిలక్ష్యార్థోపాలంకృతమంగ
ళసూత్రగ్రహణంబుశుభలగ్నంబునందనరసద్గురుకృపాదానపరిగ్రహుండైశ్రే
ష్ఠాకంకణంబులుమెఱయనేత్రశ్రోత్రనాసాగ్రభ్రూమధ్యాలోకనంబులుమంగ

శారతులియ్యలత్స్యాంతర్మగ్నచిత్తంబుబ్రహ్మముడిగాబ్రహ్మనుకూలంబునంద
సరిజ్ఞానాగ్ని వ్రేగినకర్మలాజహోమంబులుసేయుచు మతిజేహేంద్రియాదిజ
గత్ప్రపంచంబనుసమిత్తులుబోధశిఖబడ వ్రేల్చియంతఃకరణాజ్యాహుతిసేయు
చు వాసనాప్రాణచిత్తజయంబునతత్వజ్ఞానాగ్నియొక్క ప్రదక్షిణంబుగా వెల్గ
నాత్మారోపణంబుసేయుచుభూరిదానంబుగాచిత్తత్యాగంబునుమహాత్యాగం
బునుంజేసిసాంగంబుగాసకలకర్మకృత్యంబులుదీర్చుచుశత్రుమిత్రాత్మకంబగుస
ర్వజనంబులకుయథేష్టంబుగాపుణ్యాపుణ్యయుక్తంబగు నాగమకర్మభోజనప
దార్థంబులుస్తుతినిందావ్యాజబలంబుననూరవిందుగావించుచువ్యావహారికప్రా
తిభాసికసత్తలకతీతంబగునిరంతరనిరుపద్రవప్రత్యక్షపారమార్థికబ్రహ్మస
త్తాస్వరూపంబగుసన్మార్గంబులనడుచుచుజీవేశ్వరకూటస్థబ్రహ్మైక్యావలోక
నామృతాహారులై సకలసంభ్రమంబులవివాహంబునెరవేర్చుచునంతమిథ్యాపు
రుష సూర్యాస్తమానంబగుటయు రాగద్వేషంబులను పక్షులుసంసారవృక్షా
గ్రంబులనాశ్రయింపజాలకకృత్రిమంబులనుజనులుమాయానిజనివాసయుక్తింద
నరనరిషడ్వర్గతిమిరంబెదు రెరుంగనీకీమూఢమానసంబులనుదిక్కులపికట్టిల్ల
సువ్రతజన చిత్తాకాశంబుననానాపుణ్యనక్షత్రంబులు ప్రకాశింపవృత్తినిరోధ
చంద్రోదయంబుషోడశకళలందనరసాధనాంతఃకరణకుముదంబులువికసింపన
ను బంధచతుష్టయంబులనుచకోరంబులు చెలంగయోగశాస్త్రార్థకాముకజనం
బులుసంతసిల్లనప్పుడుముక్తివధూవరులుభూమికాసప్త ఋషిమండలత్రయమ
ధ్యంబున వెలుంగు నవ్వసిష్ఠుసన్నిధానంబున పీతాభాస్వత్యాణు రూపంబునంగ
నుపించునరుంధత్యావలోకంబుసేయుచుసత్కృత్యంబులుదీర్చుచుసుఖంబుండి
రిట్లుపనిషదర్థవాదప్రకారంబులనుదినంబులుగడుపుచుసర్వశుభలక్షణంబుగా
ను శ్రేయోమార్గధ్యానంబులనాకబలిమొదలగుశోభనంబులుసేయుచున్నంత
నవుడుసంవత్సరోత్సవంబులకుంజెలంగి ముక్తివధూవరులాదియగు సర్వజనం
బులు నాలుగువేదంబులందనరుతత్వమస్యాదిమహావాక్యంబులనకొప్పెరలనిం
చినసచ్చిదానందనిత్యపరిపూర్ణంబులనుపంచపదార్థయుక్తరసంబగువసంతం
బుప్రాణాయామజయంబులనుబ్రహ్మాత్మలనుయంత్రాసనంబులనుంచిమనకోవు
లనించి వేదాంతశిష్టితార్థంబులంజల్లుడలాడనప్పుడాత్మకాంత తనపతియగు
దేశికస్వామినియానందరసవసంతంబునం దేలించుటయుంజూచిముక్తికాంతా
లలామవైరాగ్యోపరతులనుచెలికత్తెలుంబ్రేరేపస్వరూపప్రకాశంబునుకడకం
టజూచు ప్రకాశంబునుముఖంబునుచిరునవ్వుదళుకొనత్తశుభేచ్ఛయనుకరంబు

న రాజయోగరసంబను వసంతంబు దెచ్చి తనపతియగు యోగీంద్రునిపైనించవా
డు ముసిముసినగవులునగుచు ధ్యానపాత్రంబుననుభూతిరసంబను వసంతంబు
దానిపయిం జిలికిన పదియును జెలరేగి యోగాభ్యాసరసంబునం దోఁగించి లక్ష్యత్ర
యములను మూలదాఁగఁబోవుటయు వాఁడును సద్వాసనా కరగతభోగేచ్ఛావసం
తపాత్రుండయి వాసనాపుష్పయుక్తంబులగు మనోవృత్తికురులఁ దూలి యాఁడ
యాభరణాంబరంబు జారలలితానందకుండలంబులల్లాడ వైరాగ్యముఖం
బుం జెమర్ప దానివెంబడిం దగిలి యంతర్లక్ష్యంబునఁ జిక్కించుక వ్యాపకంబుగ వ
సంతంబె వలనదోఁగించు సమయంబున నది నిర్వాహారియగుటం జేసి వానికరగత
మగు వసంతంబు వానిపైనించు నవసరమున శ్రుతికాంతలు వానిదర్లనీక సాధకం
బను బంద్ధిచే బిగఁబట్టుటయును కామాతురులకు సిగ్గు లేదవుటం గాన వైరాగ్యో
పరతికరగతంబగు నిర్విషయానంద వసంతంబు వాఁడాసిత నభార్యాసహాయ
స్త్రీసమూహంబు మీఁద వర్షంబుగాఁ గురియించుటయు సమాధివిరోధంబు ల
గులయవిక్షేపకషాయ రసాస్వాదస్త్రీలు దూరంబుగాఁ దొలంగునప్పుడు ముక్తి
కాంతాసమరసానందవసంతంబు యోగభోగస్త్రీలందియ్య యేమరించి యా
రోభూమికయగు పాదార్ధభావనావిశేషంబుననిక్కి నిత్యనిర్మలకరంబులు ఘ
నంబుగాఁ బ్రసాదించి పతిమనశ్శిరో వీధిన భిషేకంబుఁ జేసి దేహాత్మబుద్ధిరహితం
బను పాదంబులనంతర్నాదమంజీరంబు దీర్ఘఘంటికారావంబున మ్రోయ స
వికల్ప కాంబరంబు నిరామయ కుచంబులపై జార బాహ్యదృశ్యానువిద్ధశబ్దా
నువిద్ధసవికల్పకంబులను కుసుమయుక్తంబగు సంతర్దృశ్యానువిద్ధశబ్దానువిద్ధం
బులనుకొప్పు నిర్వికల్పంబుగా వీడ స్వయంప్రకాశంబను తాటంకంబులు స్ఫూర్తిదీ
ప్తి వల్లాసభావాభావమధ్యంబసియాడ జ్ఞప్తికళాముఖంబుగాఁ జెమర్ప నిరాభా
సంబునందఁ బడు చుసుషుమ్నాంతర ద్వారంబనం నవాయుమనోవేగంబుగాఁ బ
రుగెత్తి మండలత్రయంబులు గడచి పారమార్థిక సత్రారహస్య మంటపాంతర్గ
తానందవసంతంబని ర్వ్యాజకరంబున చిన్మయపాత్రంబు బూర్ణంబుగావించి
తెచ్చు సమయంబున దానిపతియగు నవధూతయును సమాధిసాధక స్త్రీసహి
తుండయి ప్రత్యగానందకూటసమార్గంబున కెదుర్కొని యద్వయ బ్రహ్మాసై
తన్యాసలోకసంబు చేతనున్నానియగు దానికరంబు బట్టుటయు నదియు సిగ్గుప
డక తుర్యాతీతంబను వేణొక్క కరగతానందవసంతంబు వానిపయిఁ జిమ్మ విజ్ఞాన
కళామోహంబున దాని చెక్కిలిముద్దుకొనుచు స్వరూపలీలావినోదంబుల లోక
లోకగురుసరసంబు వసంతంబులాడుచు నిట్లత్యంత సంభ్రమంబులవారలు వసం

తోత్సవక్రీడావినోదంబులం బ్రొద్దుపుచ్చుచుండిరంత నారాత్రియాత్మకాంతా
సమేతుండగు సద్గురువర్యాజ్ఞాపనంబున ముక్తివధూవరులకు చిచ్ఛక్తి మొదలగు
కాంతలు నిషేకశోభనద్రవ్యంబులమర్చి శుభముహూర్తంబున దేహార్థపాత్రం
బులను ఫలంబులు గురునకు దానంబు సేయించి యావధూవరుల నిద్దరిఁ గొల్లాట

## (శోభనముహూర్తఘట్టము.)

మండలాంతర్గతమందిరంబున హంసతూలికాతల్పంబున శోభనంబులు పాడుచు
వారిని నిచి గురుసన్నిధానంబునం జేరి ఇష్టకథావినోదంబులనుండిరంతనక్కడ ము
క్తివధూవరులు వేదాంతార్థకళాయోగకుశలులయ్యును నూతనసంగమంబగు
టంజేసి స్వరూపోన్ముఖస్మరక్రీడాదంభసమయంబున ముక్తికాంతాలలామ ము
గ్ధయగుటయును భర్తయగు యోగీశ్వరుచిత్తంబు ముక్తికామాతురత్వధ్యానం
బుచేత మండలత్రయమధ్యంబున వెలుంగు నాత్మపీఠాభాస్వత్స్వణురూపంబనిశ్రు
తిపలుకుటం జేసి యది యెముక్తికాంత ధరియించిన పీతాంబరంబగునట్టి యంబ
రగంబు గాంచు మనోయుక్తిం దివియుటయు నిర్వాణియగుటం జేసి వాయుచల
నంబను కరంబున యోనిస్థానంబగు సుషుమ్నాంతరద్వారంబు మూసి చిత్తవిక్షే
పంబను వేరొక్క కరంబునందనకు దూరంబున వెలుంగు జీవకళారూపదీపంబు
చాయనడ్డంబు చేసిన నదియునొక్క మనోహరంబై గతాయాతసుఖంబునందన
ర్చైనంత నా కాంత సునిష్టయనుసిగ్గున గతాయాతంబునుం గాక చిత్తచలనంబను
విక్షేపంబును గాకనూరకుండుటయునప్పుడు యోగీశ్వరుండగు పతి వృత్తిసహిత
మనోవ్యాపకసులీనంబను కౌఁగిటం గీలించి మొదలంబుల కాంకురంబులు వాడము
దృఢచిత్తంబున హంసతూలికాతల్పంబునందు స్వయంప్రకాశంబున వెలుంగ
ముందర నిడుకొని తత్ప్రకాశమానంబులగుచు వెలుంగి చెక్కిళ్లు ముద్దుగొనుచు
సంవిధానందకుచంబులు నివురుచు స్వరూప చెలిమి సేయుటయు పరమపతివ్ర
తయగుటం జేసి పాతివ్రత్యంబున భర్తకుప్రియంబగు రీతిని పెనంగ కళలంటుచు నా
దస్వరూపంబులు శ్రావ్యంబుగా హృదయంబు గరంగి కుండలీశక్తిభేదంబున యో
నింజమర్పించిందు తనంబుగా రహస్యక్రీడలం బరవశులై యరముకుళితనేత్రుల
గుచు వృత్తిరహితచిత్తాకాశచిదాకాశశరీరంబులు రెండు నైక్యంబుగా పెనం
గి గాఢరతులచిత్తంబు తన్మయంబగుట జేసి నున్నానియగు తుర్యంబున సుఖజ్ఞప్తిక
ళాసత్తామాత్రంబుగా నుండునప్పుడు శుద్ధవాసనాయుక్తులగుటం జేసి మరికొం
తదడవులకు సమాధిగళితంబుగా యోగీశ్వరుని చిత్తంబు మధ్యవిక్షేపంబు నొందు
టుబుట్టిననది యెపోలయాబుక యగుటం గ్యావున సవికల్పకజ్ఞానంబు గాఁ బిదాకాశ

స్వరూపంబగుము_క్తికాంతాచిత్పురుషుండభిముఖంబుగాఁగైకొనిజీవపరైక్యం
బును నత్యంతప్రేమంబుల తుర్యతుర్యాతీతంబులగు రతిక్రీడలంజెలంగి నిర్వ
యోగనిద్రలసుఖంబునందనరనం దవివేకప్రభాతసమయంబగుటయు నజ్ఞాన
తిమిరంబు వర్ణాశ్రమాచారజనహృదయగుహాలంబ్రవేశింపధ్యానభ_క్తివైరా
గ్యంబులు వెలవెలంబారము నిజనహృదయకమలంబులు వికసింపనుపనిషదర్థ
ప్రతిపాదకభృంగఝుంకారంబులెసగ పూర్వహృదయశిఖరినారూఢజ్ఞానభా
నుండుదయించుటయు తత్త్వజ్ఞజనసంచారప్రకాశంబైయొప్పుచుండెనంత నా
ము_క్తివధూవరులునుతత్సమయంబున మేల్కనియాత్మాంగస్థాన సద్భావంబు
లనుగురుశుశ్రూషలనిత్యకృత్యంబులుదీర్చియాచార్యానుమతంబునంబత్నీసమే
తంబువేదాంతార్థరాజ్యాభిషి_క్తులై యఖిలబోధార్థవస్తువులసర్వజనసంతో
షకరంబుసేయుచు పరమైశ్వర్యసుఖంబు నందనగిఁ గురుకృపాలబ్ధంబగు నిజని
వాసగృహంబత్యంతక్రీడావినోదంబుల కాటపట్టగుటంజేసియందాత్మారామ
శృంగారవనంబులుజూచుచు నిగమవృక్షశాఖాగ్రంబుల మోక్షసాధకశుకశా
రికాకోకిలస్వరంబులునోహోయనవాలకింపుచు నాగమార్థరహస్యంబులను
దిగురుమావిగుములనీడలనిలుచుచు పరలాభఫలంబులురుచింపుచు శుద్ధవాస
నాపుష్పంబులాస్వాదింపుచునంతశ్శీతలంబులగు పొదరిండ్లక్రీడలుసల్పుచు సం
తోషకరంబులు తనప్రియాకాంతను పొడవుగానిక్కించనున్నశాస్త్రార్థతరు
శాఖాగ్రంబులంబ్రకాశించుగుణత్రయపుష్పంబుల జిదిమితత్సమీపంబుననున్న
శుద్ధసత్వకుసుమంబులందియ్యసుఖతరంబుగాఁ గౌగిటంబించియాపుష్పంబులుశి
రంబునధరియింపుచు యోగయు_క్తంబులగు శ్రీశైలమేరుశిఖాగ్రంబులందలిబా
హ్యలక్ష్యంబైన ద్వాదశారచక్రమేఘసంచారంబులకలరిమనోమయూరంబు
లు చెలంగమారుతజయంబులను మెరుపులుచిత్తజయమేఘగర్జితంబులందక్షు
నంగనుపించనులికివృత్తిభయంబునంగౌఁగలించు కొనునిజ కాంతాలింగనంబు
నందవరుచు యోగభోగంబులనునశ్వత్థపిచుమందమందారభూరుహంబులం
జెండ్లిండ్లుసేయుచు వివేకభూజంబుననల్లినగురుకృపో_క్తియనుతీగెలనుయ్యాల
లూగుచుతత్త్వకందరంబులందాగుమూతలాడుచు స్వరూపాధరపానంబులన
స్పటప్పటికిబుద్ధివృత్తిసంచారంబులనుబడగొకలదీర్చుచుబ్రహ్మోహంబనుసుశబ్దం
బులమోఁగియూశలమేటిదరులచిన్మయానందపూర్ణసిద్ధపోనకాలువలనాత్మపు
ష్పాక్షపద్మంబుగట్టుచు మనోహరకృత్యంబుల జెలంగి మరియునజపామంత్రాను
రంధ్రంబులుగాంచనలుకేశపరాభ్యాసత్త్రీపురుషులగుటంజేసి రేచకపూరకకుంభక

ప్రవాహంబులదనరుసిడాపింగళా సుషుమ్నాఖ్యలగంగాయమునావానదులఁ
లంజెలంగు నాభోరాదికమలంబరస్వరాలోకనంబుల నొండొంటిఁ గందిచ్చువి
నోదంబులకలరితాముసు చిన్మయహంసలవడవ్వలుదాల్చుచు ననాహతపక్ష
ద్ధచక్రవాకమిధునంబులంపాయంబోవుచుప్రణవనాధ ఝుంకారములు గలన
హుంకారభృంగంబులనివారింపుచు నంతఃకరణసరోదరయుక్తంబగుత్రివేణీ
సంగమంబులనిరామయ కుచప్రమాణజలంబులనానందంబుఁజల్లులాడుచు ని
ర్వాణాళింగనంబులనధరాదిచుంబనంబులమర్మస్థానంబులంటుచుఇచ్ఛావినో
దంబులంజలక్రీడలాడుచునత్యంతప్రియానదీతీరంబునంజేరియొకరికొకరువస్త్రా
భరణంబు లలంకరింపుచుహృదయంబురమింపసత్యజ్ఞానమోహంబులనన్యో
న్యాలోకనంబుల గాఢాలింగనంబుల సుఖప్తికళామూర్తులగుచు నానాభో
గంబులందనరిలక్ష్యత్రయంబులగునిజగృహంబులంబ్రవేశించుసమయంబునచి
త్తవిశ్రాంతిమొదలగుసుందరులానందారతులియ్య బ్రహ్మానందంబునంజొక్కు
చుసుఖాసన సహజానందశయ్యల స్వస్త్రీసమేతంబుగానిజలీలసుఖంబుండు
చునారూఢజ్ఞానసన్మార్గంబుల నడుచుచుసిద్ధాంతమార్గంబులనిత్యమహోత్స
వంబులుసేయుచు సద్గురువాక్యార్థరాజ్యపరిపాలనంబులందనరిసర్వజనంబు
లతత్వార్థంబుగాబోషింపుచు నిట్లుముక్తవధూవరులునిరంతరసుఖక్రీడావినో
దంబుల బ్రొద్దుపుచ్చుచుసుఖంబుండిరనిశ్రీవ్యాసభట్టారకాచార్యుండుధర్మజు
నకుపరమరహస్యంబగు బ్రహ్మముభోగంబు శృంగారకథాలక్షణంబునవిను
పింపసకలజనానందకరంబుగానాసమయంబునదేవదుందుభులుమొరయసమ
రులుకుసుమవృష్టిగురియింపనత్యంతోత్సాహంబుతోకృష్ణద్వైపాయనుండు
పరమామృతజ్ఞానోల్లాసియగు యుధిష్ఠిరుంజూచినీవాత్మారామత్వంబున జీవ
న్ముక్తుండవైసద్భోగంబులంబొందుచుసుఖంబుండుమనిమరియునిట్లనియె॥ఉ॥
శ్రీకరలీలలంజెలగుశ్రీగురునాథకృపావిశేషవి। ద్యాకుశలంబులందనరియాత్మ
లముక్తివధూవరుల్ప్రబో। ధాకృతినిత్యసంపదలహర్షమునొందుచు నుండిరిట్టి
పూ। ర్వాకృతపుణ్యభావమహిమాతిశయంబునుతింపశక్యమే॥క॥ కుంతీసుత
నీభాగ్యం। బింతింతనియెంచవశమెయీకథవినువా। రెంతయుసకలశుభశ్రీ।
సంతానమునందుచంద్రుసత్యాముధాత్రిన్॥క॥ కల్యాణాపేక్షితులగు। కల్యా
ణులుముక్తిలలనకల్యాణముసా। కల్యతవినగోరినసా।ఫల్యంబుద్రౌపదీపరమా
ర్థంబై॥ కావున॥శా॥శ్రీరామస్తవరాజమెవ్వతెలలోజింతింపుచున్వ్రాయుచున్
సాహోక్తిన్వినుచుండినట్టిఘనులుత్సాహంబుతోసంపదల్। మీరన్నిత్యమహో

త్సవంబులను నెమ్మిఁ గాంతురే ప్రొద్దునా। త్మారామంబు గన్ని దేశములని తా, నందు రైధర్మజా॥ గీ॥ సకలశుభములు రాఘవ స్తవమునీకు। నెఱుక జెప్పితి నివినీవు మెల్ల ప్రొద్దు। దలఁపుచుండుము సంపదల్గ లిగి సౌఖ్య। మందుచుండెదు సత్యంబ నార్యవినుతి॥ వ॥ అని వేదవ్యాసుండు ధర్మజున కెరింగించి నిజాశ్రమంబున శిష్య పోషణంబు సేయుచు సుఖంబుండె ధర్మజుండును సంతత శ్రీరామ స్తవ రాజ పారాయణమహోత్సవంబులు సేయుచు సుఖంబుండె నని నవిని సంతుష్టాంతరంగులైన సనకాదిమహామునులత్యాదరంబున శ్రీరామ స్తవ రాజమహాత్మ్య మహిమంబును శ్రీవ్యాసభట్టారకాచార్య ప్రభావంబును ధర్మజుం గొనియాడుచు సూతుం బ్రశంసింపుచు సుఖంబుండిరిట్లు॥ క॥ శ్రీకర మునిజనహృదయవ। శీకర బ్రహ్మాద్రదివిజ శేఖరవినుత। శ్రీకర సంతతజయలక్ష్మీకర యదుకులవిహార శ్రితజనధారీ

మాలినీ॥ నయనహృదబిందస్వాంతర్మనః ప్రాణముద్రా। నయనఘనసుషుమ్నా నాడిసంయోగనిద్రా। నయనజితసుకంధ్రా నాదసద్బ్రహ్మరంధ్రా। నయనకళదినేశా నాసికాగ్రప్రకాశా॥ ... ... ... ... ॥

గద్య॥ ఇది శ్రీరామచంద్రవరప్రసాదలబ్ధకవితావిలాస శాండిల్య గోత్ర పవిత్ర కృష్ణయామాత్యపుత్రవినుత గుణధుర్య మల్లయామాత్య ప్రణీతంబైన శ్రీరామ స్తవ రాజంబను మహాప్రబంధంబునందు శ్రీవ్యాసభట్టారకుండు ముముక్షులక్షణంబును ఆచార్యస్వరూపంబును శుశ్రూషాలక్షణంబునుం జెప్పి ధర్మజుండు శ్రీవ్యాసభట్టారకాచార్యుం బ్రశంసించుటయు కృష్ణద్వైపాయనుండు యోగీశ్వర ప్రభావంబు జెప్పుటయు యుధిష్ఠిరుండు గురుకారుణ్యంబునం గలుగు మోక్షలక్ష్మీకల్యాణంబాన తిమ్మనిన తదాచార్యుండు బ్రహ్మనందనగరవర్ణనంబును అష్టకాంతాసమేతుండగు దేశికస్వామి తెనసుతయగు మోక్షలక్ష్మి స్వయంవరంబు చాటింప నానామతాధీశ్వరులుంజను దెంచి వయామా క్తికాంత తండ్రియగు దేశికస్వామి యనుమతిని యుపరతిచెయ్యాదుక లౌకిక కామ్యకర్మసత్కర్మఫలత్యాగ నానావిధవాదజయుండగు వేదాంతి నివరించుటయు దేశికస్వామి వేదాంతయోగశాస్త్రోక్తముగా కల్యాణంబొనగూర్చుటయు వసంతోత్సవాది మహోత్సవంబులునడుచుటయు శ్రీరామ స్తవ రాజ కథాశ్రవణంబున మహాఫలంబు జెప్పుటయునన్నది సర్వంబును తృతీయాశ్వాసము.

శ్రీ రామ స్తవ రాజము- తృతీయాశ్వాసము.

స ం పూ ర్ణ ము.